# భట్టివిక్రమార్కులకథలు

గ్రంథకర్త:

కె. యస్. ప్రకాశరావుగారు.

# భట్టివిక్రమార్కులకథలు




గ్రంథకర్త:
కె. యస్. ప్రకాశరావుగారు



# పీ ఠి క.

ఇంతకుముం దనేకులీ భట్టీ విక్రమార్కుల కథలను పెక్కుతెరంగుల రచించిరి. నేనును సద్దానిసే, యనేక గ్రంథముల శోధించి, బహు క్లుప్తముగా వ్రాసితిని. ఆంధ్రలోకము నా ప్రయత్నమును ప్రోత్సహించి, ఇందలిగల లోటుపాట్లు మన్నించునుగాక!

ఇట్లు,

గ్రంథకర్త.



శ్రీకృష్ణాప్రెస్,
రా జ మ ం డ్రి.
1 9 3 5—అ.

# విషయసూచిక


1 భట్టివిక్రముల జనన వృత్తాంతము

2 విక్రమార్కుని రాజ్యప్రాప్తి

3 శిలాశాసన వృత్తాంతము

4 కాళికాదేవి విక్రమార్కునకు ప్రత్యక్షంబగుట

5 ఇంద్రుడు విక్రమార్కుని గౌరవించుట

6 సింహాసనము భూస్థాపితము గావింపబడుట

7 భోజరాజు చరిత్ర

8 భోజునకు సింహాసనము దొరకుట

9 32 సాలభంజికలకథలు మొదటిప్రతిమ చెప్పినకథ (నందవసుచరిత్ర)

10 రెండవ ప్రతిమ చెప్పిన కథ

11 మూడవ ప్రతిమ చెప్పిన కథ

12 నాల్గవ ప్రతిమ చెప్పిన కథ

13 అయిదవ ప్రతిమ చెప్పిన కథ

14 ఆరవ ప్రతిమ చెప్పిన కథ

15 ఏడవ ప్రతిమ చెప్పిన కథ

16 ఎనిమిదవ ప్రతిమ చెప్పిన కథ

17 తొమ్మిదవ ప్రతిమ చెప్పిన కథ

18 పదవ ప్రతిమ చెప్పిన కథ

19 పదకొండవ ప్రతిమ చెప్పిన కథ

20 పన్నెండవ ప్రతిమ చెప్పిన కథ

21 పదమూడవ ప్రతిమ చెప్పిన కథ

22 పదునాల్గవ ప్రతిమ చెప్పిన కథ

23 పదునైదవ ప్రతిమ చెప్పిన కథ

24 పదునారవ ప్రతిమ చెప్పిన కథ

25 పదునేడవ ప్రతిమ చెప్పిన కథ

26 పదునెనిమిదవ ప్రతిమ చెప్పిన కథ

27 పందొమ్మిదవ ప్రతిమ చెప్పిన కథ

28 ఇరువదవ ప్రతిమ చెప్పిన కథ

29 ఇరువదొకటవ ప్రతిమ చెప్పిన కథ

30 ఇరువదిరెండవ ప్రతిమ జెప్పిన కథ

31 ఇరువదిమూడవ ప్రతిమ జెప్పిన కథ

32 ఇరువదవనాల్గవ ప్రతిమ జెప్పిన కథ

33 ఇరువదయిదవ ప్రతిమ జెప్పిన కథ

34 ఇరువదారవ ప్రతిమ జెప్పిన కథ

35 ఇరువదేడవ ప్రతిమ జెప్పిన కథ

36 ఇరువదెనిమిదవ ప్రతిమ జెప్పిన కథ

37 ఇరువదితొమ్మిదవ ప్రతిమ జెప్పిన కథ

38 ముప్పదవ ప్రతిమ జెప్పిన కథ

39 ముప్పదొకటవ ప్రతిమ జెప్పిన శాలివాహాన వృత్తాంతము

40 ముప్పదిరెండవ ప్రతిమ జెప్పిన స్వీయచరిత్రి

41 ముగింపు





ఓం.

# భట్టి విక్రమార్కుల కథలు.



## —♦ భట్టి విక్రముల జనన వృత్తాంతము ♦—

అత్యధిక సౌందర్యోపేతంబును, సకల జనవాస యోగ్యంబును నగు అమరగిరియను పట్టణమునందు తొల్లి, మదనకళ యను నొక సౌందర్యవతియగు వేశ్య తన తల్లితో నివసించుచుండెను. ఆ యంగనామణి యద్వితీయ రూపురేఖా విలాసంబుల గనిన యెందరెందరో నా పట్టణమున గల ధనికులా యన్నుల మిన్నతో గూడి సుఖింపవలయునని పెక్కు తెరంగుల బ్రయత్నించిరి. కాని, యా సుందరాంగికి యొక్కరియందును గూడ వలపు జనింపకుండుటచే నెల్లరును విఫల మనోరథులైరి. ఆమెకు నచ్చిన సుందరపురుషుం డొక్కడును నా పట్టణమున లేకపోయెను.

ఇట్లుండ నొక్క దినంబున నొక సుందరాకారుండగు యువకుడా వేశ్య యింటి యరుగుపై బరుండి గాఢముగా నిద్రించుచుండెను. మరుచటి యుదయంబున నా మోహనాంగి తలుపును దెరచి, తన గృహప్రాంగణమున నొడలు దెలియక నిద్రించుచున్న ఆ యువకుని గని, యాతని దివ్యమోహన రూపునకు ముగ్ధురాలయ్యెను. ఆతనిని దనకు భర్తగా బొందజాలని యెడల దన జన్మంబు వ్యర్థమని తలంచెను. అంతట నా యువతి, గాఢనిద్రా ముద్రితుడైయున్న యా యువకుని లోనికి గొనిపోయి, యొక మృదుశయ్యయం దాతని బరుండ జేసి, యుపచ

ర్యల గావించుచు, నాతని మెలకువకై వేచియుండెను. కాని, ఆయు
వకు డెంతకును మేల్కొనకుండుట కామె యెంతయు విచారించి, తల్లి
కా యువకుని జూపి, "అమ్మా! యీ మోహనాకారు డెంతకును దెలి
వి నందజాలకుండుటకు గతం బెద్దియో దెలియకున్నది. సమర్థులగు వై
ద్యుల నెవ్వరినయిన రావించి, యీతని వృత్తాంతమును దెలిసికొనజాల
నిమొకల నేను జీవింపజాలను. ఇట్టి మన్మథ రూపుని బరిణయ మాడజా
లనినాడు నేను బ్రతుకుట వ్యర్థము" యని విచారించుచుండ, నాను
తల్లియు, తనకు లోన యిష్టము లేకున్నను, విసుగుకొనుచు, నొక వై
ద్యుని రావించి, యీసుందర పురుషుని జూపి, యీతడు మరణించెనో,
రోగగ్రస్తుడై యుండెనో, దెలుపుమని కోరగా, నా వైద్యుడా యువ
కుని యెథారీతి పరీక్షించి, మదన కళతో నిట్లు చెప్పెను.

"బోటీ! ఈ యువకుడు పెక్కు దినంబులనుండి నిద్రలేనివాడగు
టచే, యీ ప్రకారంబుగా నీత డిట్లే యింకను ఆరు మాసముల వరకు
ను గాఢనిద్దురం జెందిన యనంతరము దనంతట దానే మేల్కొంచును.
అంత దనుక యీతని కుపచర్యలం జేయుచుండువది" అని చెప్పగా మ
దనకళ ఆ వైద్యుల మాటలకు గొంత సంతసించి, తాను నిద్రాహార
ములు సైతము వర్జించి, యెల్లప్పుడును నా యువకుని చెంతనే కూర్చుం
డి యేమరక యుపచర్యల గావించుచుండెను.

అట్లారు మాసములును గడువ నా యువకు డొక్క దినంబున
నిద్దురనుండి మేల్కాంచి, తన చెంత కూర్చొనియున్న మోహనాంగిని
గని, యెంతయు నాశ్చర్యవంతుడై యామె వృత్తాంతము నడిగి తెలిసి
కొని, యనంతరము దన వృత్తాంతము నా వేశ్య కిట్లు చెప్పదొడంగెను.

"ఓ మోహనాంగీ! నేను విష్ణుపురాగ్రహారీ కుండనగు నొక బ్రా
హ్మణుడను. చంద్రవర్మ యనువాడను. నేను విద్యయం దధికాపేక్ష
గలవాడనయి, తలిదండ్రులను, నాప్తబంధుగులను విడనాడి, నానా దే

శములను సమర్థులగు గురువుల కొరకు బెక్కు సంవత్సరములు సంచారము జేయుగా నొక యరణ్యమునందు నా కొక బ్రహ్మరాక్షసుడు కనపడి, నా యుదంతము నెఱింగి, నాకు విద్యను గరపుదునని వాసమునకు గొనిపోయి, యా నాడు మొదలుకొని ఆరు మాసముల వరకును నిద్రాహారముల విసర్జించి, యేకదీక్షతో నాకు దాను నేర్చిన సకలవిద్యల నన్నింటినో నేర్పెను. ఆ దయామయుని యాదరము వలన నేను సర్వవిద్యల యందును బరిపూర్ణుండ నయితిని. నాకట్టి విద్యాదానము జేయుటచే నా రాక్షసునకు దొల్లి యొక మునివలన నీయబడినశాపము తొలిగెను. అతడు తిరుగ దన బ్రాహ్మణరూపంబు నంది, రాక్షసరూపమును విసర్జించి, నీవు పరిపూర్ణ విజ్ఞానపూర్ణుడ వయితివి. నీ మూలంబున నా శాపంబును దొలంగె. నీకు శుభంబులగును. ఇక బొమ్ము" అని నన్ను దీవించి, యాతడు తన మార్గంబు ననుసరించి పోయెను. నేనును విజపురాభి ముఖుండనై జనుచుండ, నారు మాసములనుండి నిద్రాహారములు లేని కారణంబున, నీగృహ ప్రాంగణమునబడి విసురించితి. ఇదియె నావృత్తాంతము. నీవె యారుమాసంబుల నుండియు, నా కొనర్చిన సేవలకు గృతజ్ఞుండ ఇక నా పురంబునకు బోవ ననుమతి నీయుము" అని చెప్పగా వేశ్యయగు మదనకళ వానితో నిట్లు చెప్పెను.

"అయ్యో! ఇంతకాలము నుండియు నే పడిన శ్రమ వృధయేనా? మోహనాకారుడవగు నిన్ను జేపట్టి సుఖింపవలయు ననెడి కోరిక వల్లనేగదా, యింత కాలమును, నిన్ను శ్రమలకును నోర్చుకొని, నిన్ను రక్షించుకొంటిని! ఇపుడు నీవ కిటిగా బలికి, నన్ను విడచిపోదగునా? నన్ను బరిగ్రహించి, యానందమును గూర్పవా? పురుష సంపర్కము నెరుంగని నే నింతవరకును పవిత్రురాలను గానా?"

ఆమె మాటలకు విప్రకుమారుం డిట్లులనియెను. "తన్వీ—నీవు పవిత్రురాలవే గానచ్చును. కాని నేను బ్రాహ్మణుడను—నీవు వేశ్య

యు—దాన మన యిరువురకును వివాహము పొసగనేరదు" అని పోజూచుచుండెను. అంతట నా వేశ్య యా గ్రామమును పరిపాలించు రాజునకు బోయి. తన సర్వవృత్తాంతమును వానికి జెప్పి, న్యాయ ప్రకారము విచారించి, ఆ బ్రాహ్మణ కుమారుని దనకు బతిగా జేయుమని కోరగా, నా రాజు బ్రాహ్మణయువకుని దనచెంతకు రావించి, "విప్రోత్తమా! నీ కారుమాసముల వరకును నుపచర్యల గావించి నిన్ను మనఃపూర్వకముగా వలచిన యీ సుందరాంగి యొక్క ప్రేమను తృణీకరించుట నీకు న్యాయము కానేరదు అదియునుగాక బ్రాహ్మణుడు తొలుత బ్రాహ్మణకన్యను వివాహమాడి, యనంతరము క్రమముగా క్షత్రియ, వైశ్య, సూద్రకన్యలను వివాహ మాడినను దోషము లేదని శాస్త్రము లుద్ఘోషించు చుండ, మహాజ్ఞానవంతుడవైన నీవీ రీతి నాచరించుట వివేకము కానేరదు. కాన పవిత్రురాలైన యీ వేశ్యను నీవు చేపట్టుము. అందులకుగాను నీవు తొలుత బ్రాహ్మణకుమార్తెయగు నా పురోహిత నందనను, యనంతరము నా కుమార్తెను, అటుపిమ్మట వైశ్యుడగు నా కోశాధ్యక్షుని కుమార్తెను పెండ్లియాడిన యనంతర మీ వేశ్యనుగూడ బరిగ్రహించి, యీమె కోర్కెను నెరవేర్పుము" అని చెప్పెను.

రాజుయొక్క యేర్పాటునకా బ్రాహ్మణ కుమారుడును సమ్మతించి, తొలుత రాజపురోహితుని కుమార్తెయగు శీలవతిని ప్రథమభార్యగను, రాజ కుమార్తెయగు కుముదవల్లి ద్వితీయ భార్యగను, కోశాధ్యక్షుని తనయ యగు సుమతిని తృతీయ భార్యగను స్వీకరించిన యనంతరము వేశ్యయగు మదనకళను చతుర్థ భార్యగాను స్వీకరించి, యా నల్వుర భార్యలతోడను మహానందము ననుభవించుచుండ, గొంతకాలమునకు చంద్రవర్మ యను నా బ్రాహ్మణుడు ఆ నలుగుర సతులవల్లను గ్రమముగా వరరుచి, విక్రమార్కుడు, భట్టి, భర్తృహరి, యను

నల్వురు కుమారులను గనియెను. అనంతర మామగారైన రాజు తనయల్లుడగు చంద్రవర్మకు బట్టము గట్టి తాను విశ్రాంతి గైకొనియెను.

---

## —♦ విక్రమార్కుని రాజ్యప్రాప్తి ♦—

ఇట్లు కొంత కాలంబు గడచిన యనంతరంబు విక్రమార్కుని యన్న యగు వరుచియును తమ్ముడగు భర్తృహారియు సంసారమునం దిచ్చలేని వారయి తపోవనంబుల కరిగిన కారణంబున సమర్థుడగు విక్రమార్కుండు తనతమ్ముడగు భట్టిని మంత్రిగా జేసికొని కడునేర్పుతో రాజ్యపాలనముం జేయ దొడంగెను. వారిరువురును గూడ ప్రజల తమ బిడ్డలగా నెంచి, వారికెట్టిలోపంబును లేకుండ రక్షించు చుండిరి. విక్రమార్కుని పాలనంబున బ్రజ లేకొరంతయును లేకుండ సుఖులై యుండ నంతనొక్కనాడు విక్రమార్కుండు మంత్రియగు భట్టినిబిలచి, మంత్రిపుంగవా! 'నామనంబుననొక్క కోరిక బొడమినది. అదేమందు వేని మనమీయొక్క పట్టణముతో దృప్తినంది యూరకుండుట యెంతమాత్రము బాగుగాలేదు. రాజ్యవిస్తీర్ణముగావించి పెక్కుస్థలంబుల జయింపవలయు. అందును కొంత యొక విశాలప్రదేశంబు నగవి యందొక దివ్యనగరమును గట్టవలయును. ఆపట్టణము అత్యున్నతసౌధరాజంబుల తోడను విశాలములగు బాటలతోను, సుందరముగనుండవలయును. దీనిని గురించి బుద్ధికుశలుండవగు నీ యభిప్రాయము దెలిసికొనుట యావశ్యకము అనిన విక్రమార్కుని వచనంబులకు భట్టి 'దేవా? మీయుద్దేశ్య మెంతయు సరియైనది మనమిప్పుడకార్యము గొనసాగుటకు బ్రయత్నము జేయుట ముఖ్యావసరంబై యగును. అనెను. తనమాటల కెట్టియాటంకము జెప్పపోయనిభట్టిసంశయించుచున్న విక్రమార్కుండామాటలకలరి అట్లయిన నిపుడే నీవుప్రయాణంబై మనమొక సుందర పురమును నిర్మించుటకు యనువగు తావెచటనుండునో గనుగొనిరమ్ము.

అని మంత్రియగు భట్టి కనుమతినీయ నతండు నాడే పయనంబై యనేక ప్రదేశంబుల వెదకి, యెందును దనకు నచ్చినస్థలంబును గనుగొనలేక కొంతకాలము తిరిగి తిరిగి మరల విక్రమార్కుని కడకరుగవయునను తలంపుతో నిజపురాభిముఖుండై జనుచున్న సమయంబున, యెండ మిక్కుటముగా గాయుచున్న కారణంబున నయ్యంతట డస్సి సమీపప్రదేశమునం దెచ్చట నయినను దప్పిక దీర్చుకొనుటకేదేని జలాశయంబు కలదేమోయని నలువైపుల దిలకించెను. కొంత దూరమున నాతని కొక దేవాలయశిఖరము గాన్పింప నశజామార్గము బట్టి బోవ నాదేవళప్రదేశమంత యు పాడుపడియుండుటను గాంచి, యాదెస వీడి మరియొక వైపునకుం బోవ నచట నిర్మలాంబుదపూరితమగు నొక జలాశయ మాతనికి గానుపించెను అతడొకింత తడవు జలకమాడు కొని మధురనీరంబుల గ్రోలి యనంతరం బచట పాడు దేవళమున విశ్రమింపబోయెను. ఆదేవళమునం దొక భయంకర కాళీ విగ్రహము నాతడు గాంచి, యది కాళికాదేవి యాలయంబుగా గుర్తెరిగి సద్దేవికి బలువిధంబుల ప్రార్థనాది కృత్యంబులతో మ్రొక్కి యనంతరం బచటి జల్లని నీడయం దతడు విశ్రమించిన సమయంబున నాతని దృష్టి యచట నున్న నొకశిలాస్తంభముపైబడెను. అస్థంభముపై నేమో వ్రాయబడియుండ. యాపురాతన స్తంభముపై నుండు బూడిని దులిపి అందు వ్రాయబడిన యక్షరముల జదువ అందిట్లు లిఖంపబడియుండెను.

---

## —♦ శిలాశాసన వృత్తాంతము. ♦—

" ఈమహా పృద్వీతలంబున ధైర్యసాహసోపేతుం డెవడు యీ కాళీదేవళంబునకు వామభాగంబున నున్న జలాశయంబునకు తీరమున నుండు మహావట వృక్షశాఖల మీదుగా గట్టబడిన యినుప యుట్టెల నేక కాలంబు ఖండించి, యనంతర మాజలాశయంబుపై నున్న వాడి

యగు శూలంబుపైదలక్రిందులుగా భీతిలేక పడి మరణింతునో యట్టి వాడు తిరుగ సజీవుండై కాళీకృపా సమృద్ధిం బొందగలడు. మరియు నావీరుండు ధాత్రీవలయంబున కంతకును చక్రవర్తి కాగలడు. ఆచక్రవర్తి కెల్లవిధంబుల ననుకూలించు నొక మహానగరంబు కాళీమహిమచే మూడు దినంబులలో విత్తావునవే నిర్మింపబడుట తథ్యము. ఆపురంబు సర్వ కామితార్థంబు లకును నునికిపట్టయి యమరేంద్రలోకమైయలరారగలదు. ఆసార్వభౌముం డెల్లవేళల యందును కాళీమహాతల్లిచే గాపాడం బడుచుండును.

అంత నీవృత్తాంతమును జదివినభట్టి యమందానందాంతరంగుడై ఆహా! ఈస్థలాంబౌతటి మహిమను గలది? ఇంతవరకును సింహాసనంబును దిలకించిన వాడే లేక పోయెగా! ఏలగూడకుండు? ఇది వ్యాప్రదేశంబున గాక బహిరంగప్రదేశంబుననే గలదు గదా! ఏల జూడకుండరు జూచిన నేమి ప్రయోజనంబు? ఇందు లిఖింపబడిన పనుల నెవ్వరు చేయగలరు. అందలి విషయ మెదార్థమగునో, కానో తెలియకుండము నగ నెవ్వండు ప్రాణంబుల వర్పింపనోపు? ఇదెంతటి దుర్లభకార్యంబైనను మత్ప్రభుండగు విక్రమార్కుండు సాధించితీరును. నేనిప్పుడే పోయి యతనికీవృత్తాంత మాతని నెరింగింతుగాక! యనంతరము దైవసంకల్ప మెట్లున్నదో యట్లగు. అని చింతించి భట్టి త్వరితగమనంబు నిజరాజధాని కరిగి ప్రభుండగు విక్రమార్కున కేనద్విషయంబును గ్రమంబుగా నెరిగించెను. భట్టిమెరింగించిన వృత్తాంతము నంతను సావధానంబుగా విన్న యనంతరంబు విక్రమార్కుండు భట్టీ! నీవుదిలకించివచ్చిన ప్రదేశంబునకు మనమిపుడే పోవలయును. ఆశాసనముపై లిఖింపబడియున్న రీతిని నేను నిర్భయముగ జేయుదును. కాళికాదేవి యనుగ్రహమునకు దప్పక పాత్రులముకాగలము. ఆలసింపక ప్రయాణముకమ్ము. అని విక్రమార్కుం డానతిచ్చిన చొప్పున భట్టి

ప్రయాణమును సంసిద్ధపరచి విక్రమార్కునితోనత్తావునకు పయనంబా యెను. అచట దానింతకు ముందుగాంచిన తావులన్నింటిని నతడు విక్రమార్కునకు జూపి, యనంతరము శిలాశాసనము కడకు విక్రమార్కుని దోడ్కొనిపోయెను. అతడందలి విషయముల నన్నింటిని సావధానంబుగా జదివి శాసనములో చెప్పబడిన చొప్పున చేయుటకు జంకుగొంకు లణుమాత్రమయినను లేక సాహసముతో సంసిద్ధుండాయెను.

---

—♦ కాళికాదేవి విక్రమార్కునకు బ్రత్యక్షమగుట ♦—

ధైర్యసాహసములం దేకైకని సాటిరాని మేటియగు విక్రమార్కుం డచటి జలాశయంబున జలకమాడి శుచియయి కాళికాలయమున కరిగి తానాచరించు కార్యమునకు జయము గూర్పుమని దేవి నివ్విధంబుగా స్తుతింపసాగెను.

ఓత్రిలోకేశ్వ! సర్వపావనీ! కాళీ! ఘనపాపమకోనుల గాత్రి! విలాసవ్వాణి భూషణభూషితాంగీ! తల్లీ! లోకమాత! నా బూనిన కార్యంబును నిర్విఘ్నముగా కొనసాగించి ధన్యుని జేయుము నీపవిత్రచరణాంబుజములనే నమ్మినే నికార్యంబునకు గడంగుచుంటిని కనుక నోభద్రకాళీ! సద్గుణధామా! నీదాసుని బ్రోచి నిరయము దప్పని యీవిక్రమార్కుని గరుణించి కాపాడు భారము నీయదియె.'

తదనంతరంబు విక్రమార్కభూపాలుండు మంత్రి సహితుండై సాహసంబును ధైర్యంబును బరిశోధింపు శాసనంబున జెప్పబడియున్న తెరంగున జలాశయము చెంత నొకవటవృక్షంబుండుటయు, దానికేను యుండునట్లు వేలాడుచుండుటయును గాంచి వెంటనే నావృక్షరాజము నారోహించి, యాయుట్లు నేడింటిని నేర్పుదరిజేర్చి నొక్కవ్రేటున తెగిపడునట్లు తన నిశితకరవాలంబున ఖండించెను. అదేసమయంబున నామఱ్ఱికొమ్మను చేరువనుజలాశయంబున నంతకుబూర్వము గానరాని

వాడిశూలం బొక్కటి నిట్టనిలువుగా నీటిపై బొడుచుకొనియుండ విక్ర మార్కుండు కాళిని మనంబున దలంచి దానాశూలముపై కత్యంతో త్సాహముతో నురికిన, నంతట కాళీమహాతల్లి యాతని ధయిర్యసాహస ములకును కార్యదీక్షకును మెచ్చి వానికి బ్రత్యక్షంబై విక్రమార్కుం డాసూలముపై బడకుండ దనరెండు చేతులను జాచి వానిని భద్రము గా బట్టుకొని వానిని తనమూలయుంబునకు గొనిపోయి యుపచర్యల గావించుచుండెను

ఈయద్భుత దృశ్యమునంతను దన కన్నులార గాంచిన భట్టి యానంద దాశ్చర్యములు మనమున నినుమడింప, కాళీ ప్రభావంబును మనమున నినుగించుకొనుచు, దామోదాక మూలయమునకు జనియెను. కొంతవడికి విక్రమార్కుండు తెలివినొందె, భట్టితో గలసి జగదంబ యగు కాళి నిట్లు స్తుతించె.

లోకపావని భద్రకాళీ పాహిమాం పాహిమాం
ఓదేవ దేవవినుత నిరుపమాన సద్గుణనిలయా
కళ్యాణ స్వరూపిణీ పాహిమాం పాహిమాం
లోకయికమాతా ఓ శైలేంద్ర తనయా నమస్తే.

కాళికాదేవి విక్రమార్కుని భక్తి సాహసంబుల కెంతయు మెచ్చి యాతనిని చేయెత్తి దీవించి సాదర ముగ నిట్లు బలికెను

"ఓవిక్రమార్క మహీపాలా! నీధయిర్య స్థయిర్యంబులకును కా ర్యదీక్షకును నాకు మిక్కిలి సంతసమైనది. నీ మనంబున నుండు కోరిక లెల్లయు యథావిధి సిద్ధించుగాక. ఈ ప్రదేశంబున నెటుజూచినను నొక యోజనంబు విస్తీర్ణంబుగలదియు, సర్వసంపదలకును నాలవాలమైనది యు, నిరుపమానాలంకార విరాజితములగు దివ్యహర్మ్యములతోను గో పురంబులతోను కన్నుల పండు వొనర్చు మహాపట్టణ మొక్కటినిర్మిం పబడును. నీవా మహాపట్టణంబును రాజధానిగా గొని సర్వదేశాధిప

తులను జయించి, సర్వగుణ సంపన్నుండయిన నీభట్టిని మంత్రిగా గైకొని నిరంకుశపాలనంబుగా వేయి వత్సరములు రాజ్యపాలనంబుగావింపుము నా దయవలన నీకెట్టి యాపదయును రాదు. నీ కష్టసమయములందు నన్ను దలచిన మాత్రంబున నేను నీకు దర్శనము నిచ్చుచు నీ యభీప్సితముల నెరవేర్చుదాన. మరియు నొక్కమాట. అఖిల జనములును నిన్ను నుతింప నవక్ర పరాక్రమమున నొక వేయి సంవత్సరములు ధరాచక్రమును పరిపాలించిన తదనంతరము నీ కొక్క కుమ్మరి యువతి కుద్భవించిన తనయుని వలన నీకు మృత్యువు గలుగగలదు. అంతవరకు నీ కెట్టి భయమును లేదు. అంతవరకు శత్రు జనంబులు నీపయి ప్రయోగించిన యే మాయోపాయముల వలనను నీకు మరణము లేదు" అని కాళికాదేవి విక్రమార్కునకు వరములిచ్చి యంతర్ధానమయ్యె. ఆ మహాశివనాటికా ప్రదేశమున కాళికాదేవి పలికిన గొప్పని మహాపట్టణ మేర్పడియెను. అచటికి తన నిజ జనమును రావించి, విక్రమార్కుఁడు మహా వైభవమున భట్టితో రాజ్యపాలనము గావించుచుండెను.

---

## —♦ ఇంద్రుఁడు విక్రమార్కుని గౌరవించుట ♦—

నాట్యకళయం దత్యధిక నిపుణులగు దేవాంగనలింద్రలోకమున బెక్కండ్రు గలరు వారితో రంభ, యూర్వశి, మేనక, తిలోత్తమ, సౌదామిని, కుంద, తార మొదలగువారు కొందరు ముఖ్యులు నానాటి వారు కలహములాడి, మొదటిస్థానము నాకే తామందగనన్న వాదములని గర్వించుచుండ. నంత నొకనాఁ డింద్రుఁడు నిండు సభ గావించి, అందొక రొక యోగ్యతలను నిర్ణయింప నెంచెను. ఆ సభకు బెక్కండ్రు మునివరులును, నాట్యకళా కోవిదులును, గానకళా ప్రవీణులును ననేకులు వచ్చిరి. నృత్యమారంభము కాగా తొలుత రంభయు, ననంతర మూర్వశియు, కొంత తడవు నాట్యము సలిపిరి. యింద్రాది మునులు

రెప్పపాటైన నేకదృష్టితో నాట్యము విలకింపుచుండిరి. అయినను వారినా ట్యమును నొకతీరున నుండి అందెవరధికులో చెప్ప నశక్యమగుటం జేసి యింద్రుడు సభలోని మునులను, నాట్యకళా కోవిదులను నుద్దేశించి,అయ్యా! ఇందెవరినాట్య మధిక తరమైనదో నిర్ణయించి వీరి తగవుల బాపుడనియెను. కాని యకార్యమెవరికిని సాధ్యము గాలేదు. అంతట యింద్రుం డచ్చరువంది యేమీ! యింత మందబుద్ధి శాలురను గలిగిన యీసభ యామాత్రపు వ్యవహారమును బరిష్కరింప జాలకపోవుట యా' యని దిగ్భ్రమజెందెను. సభలోనివా రెల్లరును నొకరి ముఖముల నొకరు జూచుకొనుచుండ నంత, నారదమహాముని లేచి మహేంద్రునితో నిట్లనియె.

ఓ దేవాదిదేవా! యీకార్యమును సాధింపగల నాట్యకళా కోవిదులిం దెవరును లేరు. ఈ కళయందు పరిపూర్ణ సిద్ధియున్నవాడె ఇందలి తారతమ్యముల నెరిగి చెప్పగలెను. ఈ కార్యము కొనసాగుటకు నేనొక యుపాయము జెప్పెద. నాప్రకార మాచరించిన నిదియు నిముషములో స్థిరపడగలదు. అ దేమనగు రేని భూలోకమున నుజ్జయిని యను పట్టణమును విక్రమార్కుడను చక్రవర్తి సకల దేశములను జయించి మహీచక్రము నంతను నవక్రముగా పరిపాలించుచున్నాడు. అతడుధర్మస్వరూపుడు. సకలకళా కోవిదుండు అత్యద్భుత శక్తి సంపన్నుడు. ఆ మహీపాలుని నివచటికి రావించి సన్మానించి, యీనాడు నాట్యసభగావించితివేని యాతడీ నాట్యకర్తల తారతమ్యముల నిర్ణయింపగలడు.అతడు దేవాంశ సంభూతుడు, అతనికిదక్క నీకార్య మొరులకు సాధ్యముకాదు నీవాతనిని వెంటనే యిచటికి రావింపుము.

నారదమునీంద్రుని పలుకులకు యింద్రుడు సంతసించి యూక్షణమున నే మాతలి యను సుప్రసిద్ధ సారథిని బిలచి, ఓయీ మాతలీ! నీవిపుడే యరదంబుగొని భూలోకమున కరిగి యుజ్జయినీ పుర పాలకుం

డగు విక్రమార్కునకు నాయాహ్వానమును విన్నవించి వెంటనేకొని రమ్ము, అని యాజ్ఞాపింపనాసారథియు రథంబు నలంకరించి యుత్తమా శ్వంబులబూన్చి వాయువేగంబున భూలోకంబున కరిగి, యుజ్జయినీ పురము బ్రవేశించి, విక్రమార్కుని గలసుకొని 'రాజచంద్రమా! మహేంద్రుం డమరలోకంబునకు దమకాహ్వానముసంపియున్నాడు. సత్వరమే దానుదయ చేయవలయు. రథము సిద్ధముగనున్నది. అంతట నచటి విక్రమార్కుండేగాక నితర పౌరులుగూడ మహేంద్రు సంతటివాడు విక్రమార్కుని యమరపురికాహ్వానించి నందులకచ్చెరు వందిరి. విక్రమార్కుండు పోవుటకు గొలుత సంకోచించ, మంత్రియగు భట్టి "అయ్యా! మహేంద్రుని యాహ్వానము మనము దిరస్కరించుట పాడిగాదు. ఇంద్రసన్నిధి కరుగుట మేలగును" అని జెప్ప విక్రమార్కుడు సంకోశమును వదలి మాతలితో యరదము నెక్కి యింద్రపురమున నతికాలములో జేరెను.

అంత సురపతి యమ్మహీపాలు నెంతయు గౌరవించి, యుచితాసీను జేసి, "రాజ చంద్రమా! భవదీయ యశస్కాంతి నరలోకమున నేగాక యమర లోకమునుగూడ వ్యాపించినది. నీకు సాటి యగు భూపాలురిక భూలోకమున జన్మించబోరు. నే నిపుడు మిమ్మిచటకు రావించుటకు తగిన కారణము లేకపోలేదు. అ దేమందువేని, ఈలోకమునందు రంభ, యూర్వసి యను నిరువురు సుప్రసిద్ధ నర్తకులు గలరు. వారిరువారు మేమధికులమంటే మేమధికులమని కలహము లాడుచున్నారు.అంత నేను వారియర్హతల నిర్ణయింప సభ జేసితినిగాని యెవ్వండధిక నాట్య కళానిపుణులో నేనేగాక యీ నగరియం దెవ్వరునుగూడ నిర్ధారణ గావింపజాలరైరి. అంత నారదమునీంద్రుని యానతి చొప్పున నిన్నిచటికిరావించితి. వారిరువురిలో నెవ్వరధికులో నీబుద్ధికుశలతవిని యోగించి నిర్ధారణగావించి, మాకోరిక నెరవేర్చునది" అనిన యింద్రునిమాటలనువి

క్రమార్కుడు నవ్వి, ఓ యింద్రా! వేల్పులకు ప్రభుడవయిన నీవెరుం గని విషయంబు నే నెరుంగగలనా? అయినను బ్రయత్నించి చూచెద సభ గావింపుమన యా మరునాడె యింద్రుడు దేవలోకమున గొప్ప నాట్యసభ గావించి యెల్లర రావించెను.

సభ ప్రారంభమయినది. రంభయు, యూర్వశియు నెల్లరకునమ స్కరించి, నృత్యమునకు కడంగు సమయమున విక్రమార్కుండు తానిం తకుముందే సిద్ధము జేసి యుంచిన రెండుపూలదండలను దీసి యొకదానిని రంభకును, మరియొకదాని నూర్వశికిని నిచ్చి, వాటిని చేతితో బట్టుకొని విడువకుండ నృత్య మాడవలయునని జెప్పెను. ఇరువురును నాట్యమాడ మొదలిడిరి. రంభ చేతియందున్న దండ కొంతసేపటికి తటాలున భూమి పయి బడిపోయినది. యూర్వశి మాత్రమా దండ పట్టి బట్టుకొని కడ వరకును నృత్యము సలిపెను అంత నెల్లరును వినునట్లు విక్రమార్కుడు నిట్లు తీర్పు జెప్పెను.

"అయ్యలారా! నేను వీరల కిచ్చిన చెండ్లయందు కానీగలు గలవు. రంభ యా చెండును బిగియబట్టుటచే యందున్న యీగ యామె నుకుట్టినది. వెంటనే యామె చెండును జారవిడుచుటచే నాట్యమునందలి లక్ష్యము దప్పినది. ఊర్వశి యట్లుగాక చెండును తేలికగా బట్టుకొని నాట్యము సల్పినది. అందుచే నామెకు కడవరకును లక్ష్యముదప్పలేదు. ఇరువురును నాట్యకళయందు నిపుణులే. కాని, రంభ నాట్యమునందు గొంత లోటు గనుపించినది' అని నుడివెను. విక్రమార్కుని యుక్తికిని సమయోచిత బుద్ధికిని నెల్లరును సంతసించిరి. దేవేంద్రుడు రంభోర్వసు లకు నుచిత బహుమానముల నిచ్చి బంపివైచినయనంతరము విక్రమా ర్కుని చాతుర్యమునకును. నాట్యకళా నిపుణతకును మెచ్చి యతడు విక్రమార్కునకు ముప్పదిరెండు మెట్లును, ముప్పదిరెండు సాలభంజికల

ను గలిగిన నొక దివ్యరత్న ఖచిత సింహాసనమును బహు మానముగా నొసంగెను.

—♦ సింహాసనము భూస్థాపితము గావింపబడుట ♦—

దేవేంద్రుఁడిచ్చిన యా యద్భుత సింహాసనమును గొని విక్రమార్కుండు నిజ రాజధానియగు నుజ్జయినికి జని, యొక శుభ ముహూర్తంబున నెల్ల గ్రహంబులకును శాంతి నొనర్చి, భూసురుల కన్న దానాదికృత్యముల నొనర్చి, వందిమాగధులు స్తోత్రములొనర్ప దాను గద్దియ నలంకరించెను. ముప్పది రెండు విగ్రహములుగల నాసింహాసనము పై విక్రమార్కుఁడు వేయు సంవత్సరములు ధర్మతత్పరుఁడై యేకఛత్రంబుగా రాజ్యపాలన మొనర్చి చిరకీర్తి నార్జించి, తుదకు కాళికా దేవి యానతిచ్చిన చొప్పున ప్రతిష్ఠానపురమున పదమూఁడు నెలల బాలికకు జన్మించిన శాలివాహనునిచే రణరంగమున హతుఁడాయెను. విక్రమార్కుఁడు మరణించు నప్పటికి యాతని భార్యలలో నొక్కతె గర్భవతిగానుండి యనంతరమొక మగశిశువును గనియెను. ఆతఁడు పెరిగి పెద్ద వాఁడగువరకు మంత్రులే రాజ్యపాలన మొనర్చి, యితఁడు యుక్తవయస్కుఁడు కాఁగానే వానికి పట్టాభిషేక మొనర్చి, విక్రమార్కుని గద్దెపై నెక్కించబోవ నంత నాకాశవాణి యిట్లని పలికెను.

“మంత్రివర్యులారా! సాహసౌదార్య సద్గుణ విరాజితుండగు విక్రమార్కుండు దక్క నన్యులీ సింహాసనము నధిష్ఠింప నర్హులు. దానఁ జేసి యీముప్పదిరెండు ప్రతిమల సింహాసనమును నొక్కచో నిక్షేపింపుఁడు’ అనిన యాకాశవాణి పలుకుల కెల్లరును నచ్చెరువంది, యువరాజునకు మరియొక సింహాసనముపై పట్టాభిషేక మొనర్చి, ఆయింద్రదత్త సింహాసనము నొక్కచోఁ బూడ్చి యా ప్రదేశంబు నొకబ్రాహ్మణునకు దానమిచ్చిరి. విక్రమార్కునివలెనే యాతని కుమారుఁడుగూడ చిరకా

లము రాజ్యపరిపాలనము గావించి విశేషకీర్తి నార్జించి గతించెను. విక్ర మార్కుని గద్దె నిక్షేపింపబడిన నేల నా బ్రాహ్మణ కుటుంబము పెక్కుతరముల వరకును ననుభవించెను.

---

## —♦ భోజరాజచరిత్ర ♦—

తొల్లి రాధాపట్టణంబను నొక మహానగరంబు గలదు. ఆపట్టణ ము సకలయిశ్వర్యములకును నునికిపట్టయి, జగద్విఖ్యాతమునై యనేకం బై యత్యంత శోభాయమానమై యలరారుచుండె. ఆదివ్యనగరమును భోజభూ పాలుండు రాజధానిగా జేసికొని, న్యాయమును, శీలమును, దప్పక దయా దాన, సత్యశౌచాది సద్గుణంబులతో రాజ్యపాలనము చేయుచు భోజ రాజును బోలు మహీపతి యీరేడు లోకంబులను లేడనుకీర్తి నార్జించె ను. ఇట్లు సర్వసమర్థుండయి రాజ్యపాలనము చేయు భోజుం డొక్కదిన మున తన మంత్రియగు నీతిమంతుని బిలచి యిట్లనెను.

మంత్రిశేఖరా! మన రాజ్యమందలి గల యడవులలో దుష్టమృ గంబులు వృద్ధియై ప్రజలను, పశువులను, పంటలను ధ్వంసము జేయుచు న్నవని పలుతావులనుండి పౌరులువచ్చి మొరలిడి వెళ్ళినారు. మనము వారికష్టముల జూచుచుండియు నూరకొనుట భావ్యముగాదు ప్రజలును సుఖులై యుండునప్పుడేగదా ప్రభువును కానందము. గనుక నిక జాగు చేయక వేటసన్నాహముల జేయుము. మనము త్వరలో నా దుష్టమృ గముల బరిమార్చి ప్రజల బాధల తొలగింపవలయును

అంత మంత్రియు రాజాజ్ఞను సిరసావహించి, సచిరకాలములోనె వేటకు వలయు సర్వసన్నాహముల గూర్చె. అంత భోజ నృపాలుండు తన పరివారములతోడను, నాయుధములతోడను వేటకై యడవులకు ప్రయాణమై చనియెను.

---

—♦ భోజునకు సింహాసనము దొరకుట ♦—

విక్రమార్క నృపాలుని సింహాసనము నిక్షేపింపబడిన స్థలము నం దిప్పుడొక జొన్నచేను దట్టముగా బెరిగి యున్నది. ఆచేనున కెజమాని యగు నొకవిప్రుండు మంచె నెక్కి పిట్టలదోలుకొనుచున్న సమయంబున భోజుండు తన పరివారసహితంబుగా నాత్రోవను రాగా, మంచె పైనున్న విప్రుండు వారిని జూచి,

"ప్రభులారా! రండు దయచేయుడు. మీరాకచే నేను నాచేను పావనం బైనది. యీజొన్నకంకులను భక్షించి శ్రమను బాపుకొనుడు ఇదియె నా యాతిథ్యము గ్రహింపుడు. ఈయాదబన్యముతో మీరామెల్లరకు విందొనర్చెద. అని నావిప్రుండు మంచె దిగివచ్చెను. ఇంతలో భోజుని పరివారము గొన్నికంకులను విలబెట్టి యాచబియ్యావమును గోయుచుండిరి అంతట విప్రుడు మంచిదిగి చూచి వెంటనే భోజుని కడ కరిగి, 'స్వామీ! ఇదేటి యన్యాయము నావంటి పేద బ్రాహ్మణుని చేనంతయునిట్లు ధ్వంసము జేయ మీకు తగునా? విప్రవిత్తము నపహరింప మీకు చేతు లెట్లు వచ్చుచున్నవి? చాలుచాలు ' మీవంటి ప్రభులే యిట్టి యకార్యము నొనర్చువిక మాగతియేమి గావలయును ? అని మొత్తుకొనియెను.

బ్రాహ్మణుని యీవింత చర్యం గాంచి భోజనృపతి, ఈతడు మంచపైనుండి పల్కిన సదయపేశల వచనంబులు మంచె దిగి భూమిపై కాలిడునప్పటికి లేవు. ఈయద్భుతమున కామంచె స్థాపింపబడిన భూమియే కారణంబై యుండనోపు, అని మనంబున చింతించి, యనంతరము విప్రునితో, 'అయ్యా! మావారు తెలియక నీచేనంతయు బాడుచేసినమాట వాస్తవంబె కాని గడచినదానికి వగచినఁబ్రయోజనంబు లేదు గాన నీవు కోరినధనమిచ్చువాడ ఈచేనంతయు నాకిచ్చివేయు ఎంత ధనమును గోరుదువో వెంటనే చెప్పుము." అనిన విని పేదబ్రాహ్మణుం

డా నందమున అయ్యా! తమకు నేను చెప్పవలయునా? నేను మిగులబీదవాడనని మాత్రము గ్రహించి, తమకు దోచిన విత్తము నిచ్చి నేనును బరిగ్రహింపుడనియెను.

అంత భోజుండు సంశయింపక నాకొలది భూమికి నారులక్షల రూప్యముల బ్రాహ్మణున కిచ్చి యాభూమిని తాను స్వాధీనపరచుకొనియెను. విప్రుండును విత్తమును గొని యానందమున నిజకుటీరంబునకు జనియెను. అనంతరము భోజుం డామూచెయున్న స్థలంబును ద్రవ్వించిచూడగా నందు విక్రమార్కుని ముప్పదిరెండు విగ్రహముల సింహాసన మొకటి గనపడెను. వెంటనే భోజుండు దానిని బయటకు దీయింప యత్నించెను. గాని ఎందరు ప్రయత్నించినను కదలలేదు. అంతమంత్రి ప్రభునితో నిట్లనియెను. 'దేవా! ఇది దేవనిర్మితమైన సింహాసనము యుండవనోపు. ఏదేని బలి నొసంగినగాని యిది బయటకు వచ్చునట్లు లేదు" భోజుడా మాటల యందు విశ్వాస ముంచి, కొన్ని పశువుల బలిగా నీయనప్పుడా సింహాసనము సులువుగా బయటకు వచ్చెను. అంతట నాభూపాలుండా సింహాసనంబును తన నిజరాజధాని యగు ధారాపురమునకు గొనిపోయి, పురోహితులచే నిర్దేశింపబడిన నొక్క శుభముహూర్తమున వందిమాగధులు స్తోత్రంబులు సేయ, పరివారములు కైవారములెత్త భోజ భూపాలుండా సింహాసనము నధిష్ఠింప బోవగా నా సింహాసనంబునకు ప్రథమ సోపానము చెంతనున్న ప్రతిమ సజీవయై భోజుని వారించి మనుష్య వాక్యములతో నిట్లు జెప్ప దొడగెను.

---

# 32 సాలభంజికలు చెప్పిన కథలు.

—o—

### —♦ 1వ ప్రతిమ చెప్పిన కథ ♦—

"ఓ భోజరాజోత్తమా! ఈ రాజ్యపీఠము నలంకరింపగోరువాడు సద్గుణఖనియై యుండవలయును. అట్టి యోగ్యుడీ సింహాసనము నింతకుముందొక్కడు మాత్రమే నధిష్ఠింపగలిగెను. ఆ మహాపురుషునకు దక్క తదన్యులీ రాజ్యపీఠము నలంకరింప నర్హులుకారు" అని యాసాలభంజిక చెప్పిన మాటలు విని రాజు మిక్కిలి నాశ్చర్యపడి యిట్లు ప్రశ్నింపసాగెను.

"ఓ సాలభంజికా! ఇంతకుముందీ రాజ్యపీఠము నలంకరించిన యా భూపాలుం డెవడు? నా కంటెను వాతని యెక్కుడగల సకలసుగుణము లెవ్వియో చెప్పు మాలకింత" మన అంతట నా సాలభంజిక చిరునగవు ముఖంబున నాట్యమాడ యిట్లు వాక్రుచ్చెను.

"రాజ చంద్రమా! నీ వడిగిన ప్రశ్న కిదియే సదుత్తరం బాలకింపుము. తా నితరులకన్న నధికుడనని చెప్పుచు గర్వపడుచుండువాడే యెల్లరకంటెను గూడ నధముడని పెద్దల యభిప్రాయమై యున్నది. అట్టి పురుషుని బారినుండి పుణ్యము దూరమగును. వాడు నరక కూపమున బడకతప్పదు. అందుల కొక యితిహాసమును జెప్పెద నావధానువయి యాలకింపుము" అని వెండియు నా ప్రతిమ నందవసు చరిత్రంబు నిట్లు చెప్పనారంభించెను.

—

### —♦ నందవసు చరిత్ర ♦—

పూర్వము నందవసుండను రాజోత్తము డొకండు దినమునకు లెక్కకుమించిన బ్రాహ్మణ విప్రులకు పంచభక్ష్య భోజ్యములతో

సంతర్పణముల గావించు చుండెడివాడు. అతని యుదారత్వము, ధానశీలము మూడులోకముల వారును వింతగా జెప్పుకొన సాగిరి. ఇట్లుండ నొక దినమున కలహప్రియుండగు నారదమునీంద్రుడు నందవసుని వద్ద కరుదెంచి యిట్లనియె. 'ఓ మహాదార్య గుణసంపన్నా! నీ యన్నదానమునకు మూడులోకంబులు గూడ మెచ్చినవి. కాని యిందొక లోపము మాత్రము నాకు గన్పడుచున్నయది. నీవిప్పుడు చేయించుచున్నట్లు మట్టిపాత్రలలో వంటకముల జేయించుట మాని యిసుక పాత్రలలో చేయించిన నా కార్య మెంతయు లెస్సగనుండెడిది. అది యసంభవమని తలపక ప్రయత్నించి చూడుము. ఒకవేళ నది యసంభవకార్యమైన మొదల నీవు యిక ముందునుంచి నావలెనే మృణ్మయపాత్రలనే వాడుము. మరియు నిత్యాన్నదాన మొనరించు పురుషున కెందునను నసాధ్యకార్య ముండదని యెరుగుము.

అని వాక్రుచ్చిన యనంతరము నారదుండు సత్యలోకమున కరిగెను.

తదనంతరంబు నందవసుండు నారదమహామునీంద్రుని యానతిచొప్పున మట్టికుండల నన్నిటిని దీసివైచి. వాటికి బదులుగా నిసుక కుండలను వాడుడని పరిచారకుల కాజ్ఞాపించెను. అతని యన్నదాన మహాత్త్యముచే నాతని కార్యము నిర్విఘ్నముగా కొనసాగెను.

మరికొంత కాలము గడచిన యనంతరంబు నారదుడు తిరుగ నందవసుని కడకరుదెంచి, "ఓయీ! రాజోత్తమా! నీయన్న దానమహాత్త్యము నిర్విఘ్నముగా కొనసాగుచున్న యదియా? ఇసుక కుండలు విచ్చిపోక నిలిచినవియా?" యని ప్రశ్నింప, నంత "ఓ మహాముని చంద్రమా! నేనను దినంబును నొనర్చుచున్న యన్నదాన మింతింతయని చెప్పనలవి కాదు, గాన నా యన్నదానప్రభావంబుననే నొనర్ప జాలని కార్యమెద్ది యుండును?" అని గర్వముట్టిపడ నందవసుండాడినమాటలకు మునిలోలోన చింతించి,

"నేటితో నీనిపుణ్యమంతరించినది. పుణ్యవిరహితుండగు నితని చెంతయిక మనముండదగదు" యని వెంటనే యూతావృను వదలి చనియెను. వెంటనే నిసుకకూడలు విచ్చిపోయిన వను సర్వార్త రాజు కర్ణంబులకు ములుకులవలె నాటెను.

" ఓ భోజ నృపాలకా! వింటివా? తన్నుదా పొగడుకొనుటచేతనేగదా ఆ పంద నసుని పుణ్యమంతరించినది' మఱియు నీవు నన్నుఇంతకుముందు సాహసముధిష్ఠించి ప్రభు చెప్పవు. అతనివద్దనున్న గుణవిశేషము లెట్టి? యని ప్రశ్నించితివి. అతని వృత్తాంతమును గూర్చి చెప్పుచున్నాను. వినుము"

అని యూపుత్రిక తను తొల్లిటి ప్రభువగు విక్రమార్కుని చరిత్రను భోజునితో నిట్లు చెప్పదొడంగెను.

ఈసాహసమునకు విక్రమార్కభూపాలుని ప్రసిద్ధి. అతని యుదారతకును దానగుణంబునకును శిబికర్ణదధీచులు గూడ సరిరారనుట నిక్కువంబు అతని శాత్రవులకు ముంగొంగు బంగారము. విద్యాధికులకు మొక్కదగిన వేల్పు ఆశ్రితుల నాదరించుటలో మేటిదాత. దానంజేసి యెల్లవారును నాప్రభువును బలుతావులనుండి వచ్చిదర్శించిసంతృప్తాంతరంగులై జనుచుండురు ఇట్లుండనొక్కదినంబున నొక భూసురుండు భూపాలు నొద్దకువచ్చి యతని పెక్కు తెరంగుల స్తోత్రపాఠంబుల నొనరింప, విక్రమార్కుండాతని ధోరణి జూచి, యీతడు గొప్ప విద్యావంతుడైయుండనోపునని యెంచి, అయ్యా మీ రెవ్వరు? ఏయే విద్యలలో దమకు పాండిత్యముగలదు? అని ప్రశ్నింప నాబ్రాహ్మణుం డిట్లని సమాధానమిచ్చె.

ప్రభూ! నేను చతురంగతజ్ఞుడ తొలి యక్షరము విడచిన తురంగతజ్ఞుడ; ద్వితీయాక్షరమును విడచిన రంగతజ్ఞుడ; తృతీయాక్షరంబును గూడ విడచిన గతజ్ఞుడ; చతుర్థాక్షరంబును గూడ విడచిన తజ్ఞుడ

పంచమాత్షరంబును గూడ విడచిన జ్ఞుడ. గాన నేను చతురంగతజ్ఞుడను తురంగతజ్ఞుడను, రంగతజ్ఞుడను, గతజ్ఞుడను, తజ్ఞుడ, జ్ఞుడను. ఈవిద్యల యం దేలినవారు నన్ను బరీక్షింపుడు. ఆ మాటలకు విక్రమార్కుండు సంతసించి, అతని బరీక్షించి, యాతని పాండిత్యకపరిమితానందమంది, వానికొక లక్షా పదకొండు వేలవరహాల నిచ్చి సత్కరించెను. కనుక నోభోజప్రభూ నీకడ నిట్టి విజ్ఞానమున్న చో నీసింహాసనము నధిష్టింప దగు లేనిచో వెనుకకు బొమ్ము." అని సాలభంజిక చెప్ప తరికి నాటి శుభముహూర్తము దాటిపోయినది మరియొక సుభముహూర్తము నేర్పరచుకొనవచ్చునని యెంచి భోజభూపాలుం డానాటి కూరకుండెను.

---

## —♦ 2వ ప్రతిమ చెప్పినకథ ♦—

మరియొక శుభముహూర్తంబున భోజభూపాలుండు సింహాసనము నధిష్టింప సర్వసన్నాహంబులతో నేతెంచిరా, ద్వితీయ ద్వారము చెంతనున్న విగ్రహము వాని నడ్డగిలి యిట్లనియెను. అయ్యా! మా విక్రమార్కభూపాలుని కడ నున్న మేటిగుణంబులలో నీగుణబులేపాటి నీవు యాతని సింహాసనము నధిష్టింప గోరుచున్నావు? అంత భోజుడచ్చె రునొంది, "ఓసాలభంజికా! ఆవిక్రమార్కుని మహద్గుణంబు లెవ్వియో వచించి మత్కర్ణేంద్రియములకు విందొనర్పుమా! ఆకర్ణించెద' అని యెను అంత నాప్రతిమయు నిట్లని యొక కథను భోజునితో జెప్పనా డంగెను.

కొండొక తరి విక్రమార్కుండు నిండు కొలువుండి, తనగూఢచారుల రావించి, "ఓగూఢచారులారా! మీరిచటనుండి జని ఏయే తావులం సాధ్చితిరి? ఏమేమివింతలు" గాంచితిరి? ఏయే దేశంబుల నవలోకించితిరో సవిస్తరంబుగ జెప్పుడన నొక గూఢచారుడు దమ ప్రభువుతో సవినయంబుగ నిట్లని చెప్పనొడంగెను.

ర్యార్థమై దేవి ప్రసన్నత కొరకు తపం బాచరించుచున్నవాఁడను. కాని యీ దేవి యింకను సంతుష్టాంత రంగురాలు కాలేదు. నాకువిసువుజనించుచున్నదే గాని ఆయమ సాక్షాత్కార మగుటలేదు. అని నుడివెను. అంత విక్రమార్కుఁడు మునిపుంగవునితో "అయ్యా! నేను కూడ తమ కొరకు హోమ మాచరించెదను. అప్పటికి దేవి ప్రసన్నురాలుగావచ్చును' అని చెప్పి యా మరునాఁడు విక్రమార్క భూపాలుండు హోమమునకు పరికరముల కూర్చుకొని మునీశ్వరునితో తాను కూడ చిత్తశుద్ధితో హోమ మాచరించెను. అప్పటికిని యా దేవి ప్రసన్నురాలు కాకుండుటను జేసి విక్రమార్కుఁడు కొంచెమైన తడవు చింతించి, కాళికాదేవి సంతృప్తురాలి జేయుటకై మహోగ్రముగా తనశిరము నర్పించుకొనంగవలయునని, కత్తి నెత్తి [illegible] గొన బోవు సమయమున కాళికాదేవి ప్రసన్నురాలై సాక్షాత్కారమొసంగి "విక్రమార్క మహీపాలా! సాహసమువలదు. తామసము నీవేకను మెచ్చితి అడుగుము. వరముల నిచ్చెదన అనియెను. అంతట విక్రమార్కుఁడు దేవికి ప్రణమిల్లి 'ఓ లోకమాతా! ఈ విప్రుండు పెక్కువత్సరములనుండి నిన్ను గూర్చి తప మాచరించుచున్నాఁడు. వీని యీప్సితంబు నెరవేర్పుము. నాకదియే పదివేలు' అని విక్రమార్కుఁడాడిన మాటలకు యా జగదంబ యిట్లనియె.

వత్సా! ఈ విప్రుని మనస్సు స్థిరములేక, చిత్తచాంచల్యంబుతోడను విషయలోలుఁడై యున్న వాఁడగుట నెంత తప మాచరించిన నేమిలాభము? ఇతనికి నాపయి భక్తి లేదు. నా. కేవలము బ్రసన్నురాల గానైతిని నీకు వలయు వరముల గోరికొనుము' అని పలికిన దేవికి విక్రమార్కుఁడిట్లనెను.

'తల్లీ! నీకు నాపై దయగల్గిన నివిప్రుని కోర్కె నెరవేర్పుము నా కోరదగిన కోరిక అదియె. నే తపం బాచరించినదియు నాపనివిప్రుని

యీప్సితము నెరవేర వలయుననియెను. కనుక నో జగదంబా! ఈబాప నికోరిక నెరవేర్చి నా యభిమతంబు తీర్చుము.

అంతట నా జగదంబ యింక చేయునది లేక పేద విప్రుని కోరిక నెరవేర్చి, విక్రమార్కుని కార్యంబును మెచ్చు తెరంగుల గొని యాడి యంతర్ధాన మయ్యెను. ఓ భోజభూపాలా వింటివా విక్రమార్కుని దయాంతఃకరణలు, త్యాగబుద్ధియు, నీకెట్లు వచ్చును? గనుక ఆ మహామహుని సింహాసనము నధిష్టింప నీ వనర్హుడవు పొమ్ము" అనెను

రెండవ విగ్రహా మాడిన యా మాటలకు భోజుడు సిగ్గుజెంది యప్పటికి తన కార్యంబును విరమించుకొని నిజాంతఃపురమునకు వెడలి పోయెను.

---

## —♦ 3వ ప్రతిమ చెప్పిన కథ ♦—

ఆ మరుచటి దినంబున భోజభూపాలుండు విక్రమార్కుని రాజ్యపీఠము నలంకరింప రా మూడవ ద్వారము చెంతనుగల ప్రతిమ భోజునితో యిట్టుల నెను.

"ఓయీ భోజభూపా లాగ్రణీ విక్రమార్క ప్రభువు గురించి నీకొక కథను జెప్పెద. నీవా కధనంబు నాలకించి, తదనంతరము సింహాసనంబు నధిష్టింపుము" అంతట భోజుడును వల్లెయన నా ప్రతిమ నీకథను చెప్ప మొదలిడెను.

'విక్రమార్క సార్వభౌముఁ డొకనాడు నిండు కొలువున తన మంత్రియగు భట్టితో, మంత్రి సత్తమా నాకు చాల కాలమునుండి యశ్వమేధయాగము చేయవల యుననెడి కోరికొకటి కలదు. అందుగురించి నీ యభిప్రాయంబు యెట్లుండునో యని తెలిసికొన గోరుచున్నాను. యేమందువు' అనిన నా మంత్రి శేఖరుడు తన ప్రభువుతో యిట్టుల నెను.

"దేవా! అశ్వమేధమను నది యసామాన్య క్రతువులలో నొక్కటి ఒక్క వత్సరము వరకును నొక తెల్లగుర్రమును విచ్చలవిడిగ స్వేచ్ఛా విహారమునకు వదలి, యాగడువులో దాని నెవ్వరును బంధింపకుండ నతి జాగరూకతతో గాపాడవలయు. అకార్యము మనకు సాధ్యమగునా, యను సందియ మొక్కటి మాత్రము నాకుగలదు." భట్టివాక్యము, నాలించిన విక్రమార్కుండిట్లనియెను.

"ఓయీ, మంత్రిపుంగవా! సర్వమును దైవాధీనముగాని మనలో నేమున్నది. ఆతని దయకు బాత్రులైనవాని కార్యము లేయూటంకములును లేకుండ నిర్విఘ్నముగా కొనసాగగలవు. అందుల కొక్క యితిహాసము జెప్పెద నాలకింపుము.

గొల్లి హిమవత్పర్వత ప్రాంతమునంగల ప్రతాపనిధి యను పట్టణమును బృహత్సేనుండను రాజు పరిపాలించుచుండెను. ఆ భూపాలునకు సర్వాంగ సుందరియు, నిరుపమాన విలాసవతియునగు సులోచన యను కుమార్తె యొక్కతె గలదు. మోహనాంగియగు యాకన్యను వివాహ మాడవలయునని ఎందరెందరో ధాత్రీపతులువ్విళ్లూరుచుండిరి. కాని యక్కన్నియ విష్ణుదేవుని మనమున బ్రేమించి వివాహమాడ గోరినది.

గాళకుడను నొక బ్రాహ్మణుడు చిరకాలమునుండి యా సులోచనను మనసార బ్రేమించి, యామె నెట్లయిన వివాహ మాడగోరుచుండెను. కాని యాతని మనోవాంఛితము నెరవేరు సూచన లెప్పుడుగాన నచ్చుటలేదు. ఇట్లుండ నొకనాడు విశ్వకర్ముండను నాతని స్నేహితుండు వానితో నిట్లనియెను. "మిత్రమా, సులోచన విష్ణుదేవుని దక్క నన్యుల బరిణయ మాడ నొల్లదు. నేచెప్పిన చొప్పున నీవాచరించితివేని యా మోహనాంగి నీకు దక్కగలదు, అదేమందువేని, నాకడ యంత్రనిర్మితమగు గరుడవాహన మొకటికలదు నీవద్దాని నధిష్టించి యెచటగావలయుననిన నచటదిగ గలుగుదువు. మరియు నా చాతుర్యమును నంతయు ఖని

యోగించి శంఖచక్రంబుల దయారు జేసి నీకొసంగువాడ. నీవువాటిని ధరించి విష్ణురూపముననా గరుడవాహనము నధిరోహించి సులోచన యంతఃపురంబున కరుగుము. ఆమె నిన్నే విష్ణువుగానెంచి నిన్నుగూడ గలదు అందులకు గోళకుండు మిగుల సంతసించి, మిత్రుని యొద్ద శంఖచక్రంబుల గొని యంత్రనిర్మిత గరుడవాహనము నధిష్టించి, యొకనిశాసమయంబున సులోచనయుండు సుధ్వాంత హర్మ్యంబును వచ్చెను. ఆతనింగాంచి నంత నెసులోచన యతడె విష్ణువనియెంచి, యాశ్చర్య సంభ్రమంబులు మనమున నుట్టిపడపోడ శోపగారంబుల వాని బూజించి, తనకొరిక నాతని కెరింగించి యారాత్రికి తన యంతఃపురంబున గడుపవలసినదిగా బ్రార్థించెను. గోళకుండందులకు వెంటనే సమ్మతింపక, కొంతబెట్టుసరిపై, వారిచే బ్రతిమాలించుకొని కడకు వారి కోర్కెనంగీకరించెను. అనంతరము చెలు లెల్లరును నాదంపతుల నారేయి యుథేచ్ఛగా వదలి వెడలిపోయిరి గోళకుండా రేయంతయు సులోచనతో గ్రీడించి యావేకువనే మరల వచ్చెదనని చెప్పి వెడలిపోయెను.

యామరుసటిదినంబున సులోచన గతరాత్రి జరిగిన యావృత్తాంతమును తల్లిదండ్రుల కెరింగించి, యావిష్ణుదేవునికి తన్నిచ్చి వివాహమొనర్పుడని వేడెను. ఆరేయి తమ కావిష్ణుదేవుని జూపింపవలసినదనియు, తామాతని జూచిన మరునాడు వివాహ మొనర్చెదమనియు సులోచనతో జెప్పిరి. క్రితము రేయివలెనే గోళకుండు మరునాటి శంఖచక్రంబుల ధరించి మాయగరుడ వాహనమెక్కి సులోచనయొక్క యంతఃపురంబు బ్రవేశించెను అంత సులోచనయు నాతని పరవశురాలై, యాతనిని దలిదండ్రులకు జూపెను. వారు విష్ణుదేవుని పాదములకు మ్రొక్కి, తమకుమార్తెను వివాహమాడి తమ్ము తరింపజేయవలసినదిగా వేయి విధంబుల బ్రార్థించిరి, విష్ణురూపమున నున్న గోళకుండును వారి మనోవాంఛితమును నెరవేర్చుట కంగీకరించి, ఆమరుచ

టి దినంబునే సులోచనను మహావైభవంబుతో వివాహమాడెను.

ఓ భోజరాజా! తరువాత కథను నాలుగవ విగ్రహమునేడుగుము అని యనగా భోజుడట్లుచేసెను ఆ విగ్రహముభోజున కిట్లు చెప్ప నారంబించెను.

---

## —♦ 4వ ప్రతిమ చెప్పినకథ

అట్లు సులోచనపై మోహమును గలిగియున్న గొందరు భూపాలురు గౌళకునకును సులోచనకును వివాహముగూర్చిన బృహత్సేనునిపై దండెత్తిరి. కొందరు గౌళకుండే బృహత్సేనునకు దైవ సాహాయ్యముగ లదనియు, వారిని భయపెట్టిరి. అప్పటికిని శత్రురాజు లూరకొనక బృహత్సేనుని దండింప సమకట్టిరి. అంత బృహత్సేనుండు చేయునది లేక గౌళకుని కడకరుదెంచి, 'దేవా. శత్రురాజులు మాపై దండెత్తి వచ్చినారు. విష్ణుదేవుండవగు నీ యుండ మా కుండ శత్రురాజులు నెరవకున్నారు. విజయ మెవ్వరివో జెప్ప వీలుకాదు. నీ పాదంబులచే పవిత్రయున్న మమ్ముల గాపాడి, మా కుల గౌరవములను గాపాడు బాధ్యత నీపై యున్నది" అని వేడుకొనిరి.

అంత గౌళకు డేమాత్రంబును సంకోచము జెందక, "అయ్యా! నేను మీ చెంతనుండ మీ కెట్టి యాపద యును రానేరదు. సుఖముగ బోయి పరుండుడు. ఈ రాత్రి గడచు లోపల శత్రువులందరును పంతరించెదరు. అని జెప్పి వారల బంపివైచెను. అనంతరంబు సులోచనతో తాను శత్రు సంహారంబున కరుగుచున్నట్లు జెప్పి, శంఖుచక్రములధరించి, యంత్ర నిర్మిత గరుడవాహనంబు నధిష్టించి గౌళకుండా రాత్రియే చనియెను. అతడట్లు చనిచని యొక్క మహారణ్యమున తన వాహనమును దిగవలసి వచ్చెను. ఆ యర్ధరాత్రమున నా భీకరారణ్యమున గౌళకునకు మనంబున దిగులు జనింప, "ఆ య్యో! నా కృత్రిమవేష మెంతయు

పాపకారణమైనది. సులోచనను బరిణయమాడవలయు ననెడి కామం బుచే నీ నాటకము నాడితినిగాని, యిపుడీ శత్రువు నేనెట్లుజయింతును ఈ యరణ్యమున నా ప్రాణములనైన గాపాడుకొ గలుగుదునో లేదో కదా! అకటా! ఎంతటి విషమ పరిస్థితులలో చిక్కుకొంటిని. ఈ దెబ్బ తో నా రహస్యమంతయు సులోచనకు వెల్లడై పోవునుగాబోలు! ఇక నాకు దిక్కెవరు? ఇట్టి యాపత్సమయములందిక భగవంతుడే నన్నుగా పాడవలయును. ఓదీనబాంధవా కృష్ణా! నాయపరాధంబును సైరింపుము సులోచన యందుగల కామముచే నంధకారంబున బడి యిట్లు కపటవే షమును ధరించితినే గాని అం దిన్ని యిడుములున్నవని తలంపనైతి. ఈమోసమెల్లరకు దెలిసినేని ఇక నాప్రాణములు దక్కవు ఇక నీవే నాకుదిక్కు. ఓఆపదోద్ధారకా! దీనరక్షకా! భక్తజనమందారా యను వత్సలా కృష్ణా నీపాదములకు మొక్కుచుంటిని. ఈదీనుని వెంటనే దయజూచి రక్షింపుము." అని భగవంతుని నిశ్చలభక్తితో మొక్కు నంత దయామయుం డగు విష్ణువు కౌశికునకు బ్రత్యక్షమై "వత్సా భీతిజెందకుము. నీ వొనరించినది దప్పిదమే యయినను, పశ్చాత్తాప ముచే నీవు పావనుండవే యైతివి నీభక్తికి నాకు సంత సమైనది. సూర్యోదయమగు లోపల బృహత్సేనుని శత్రువులెల్లరును హతులగుదురు. ఇదిగో ఇప్పుడే నాచక్రము బ్రయోగించి విడుచు చున్నాను. నీకేవిపత్తువచ్చినను నన్ను దలంచుకొనుచుండుము. నీకెట్టి యాపదయు రాకుండ నేను తక్షణమువచ్చి నిన్ను గాపాడుచుందును అని చెప్పి విష్ణుదేవుం డంతర్ధానమయ్యెను. అంత కౌశికుండును నానం దపరవశుడై గరుడవాహనము నెక్కి సులోచనాంతఃపురంబున కరుదెం చెను. అప్పటి కప్పుడే సూర్యోదయమగుచున్నది. బృహత్సేనుండు కోట బురుజులపై నిలచి, యొక్క శత్రువైనను గాన రాకుండుటకాగని యచ్చెరువందుచుండెను. కౌశికుం డాతనికి నమస్కరించి శత్రువులెల్లరు

ను హతులయిరని చెప్పెను. బృహత్సేను డంత గోపకుని బెక్కుతెరంగుల కొనియాడి, యాతనికి తన రాజ్యము నొసంగి తాను తపంబున కరిగెను.

మంత్రిపుంగవా! కంటివా! దైవబలముఖ్నవారి కెట్టి కార్యములు కొనసాగినవో! అట్లె మనకు గూడ దైవ సహాయముఖ్న యెడల మన యశ్వమేధయాగము నిర్విఘ్నముగా గొనసాగనచ్చును. వెంటనే యాగమునకు వలయు సన్నాహమున నొనర్పుమని విక్రమార్కుండు తన మంత్రియగు భట్టి కానతిచ్చెను. ఒక యుత్తమజాతి ధవళాశ్వము ముఖమున నొక పటము గట్టి, కొందగ యోధుల నాయుధులుగా దాని వెంట బంపి, అనంతరంబు విక్రమార్కుండు తన పురోహితుని దనో బలిమిచే సముద్రుని యనుగ్రహము సంపాదించి, యాతనివద్ద గల నాల్గమూల్యములగు మణులను బడసెను. అందొక మణి సయిన్యముల గూర్చును. రెండవది రత్నాభరణంబుల నిచ్చును. మూడవది షడ్రసోపేత భక్ష్యంబుల నొసంగును. నాల్గవదాని మూలంబున వలయు నంత ధనంబు చేకూరగలదు. విక్రమార్కుని కీయగోరి "అయ్యా! మీరొక్క మణిని గ్రహించి నన్ను తరింపు" మన నా విప్రుండు నాయింటియందు వారికి నేది కావలయునో తెలిసికొని యనంతరము దీసికొందునని జెప్పి యింటికి జని భార్య నడుగ, నామె భర్తకు రోగపాయము బాగుజేయు మణిని కోరెను. కుమారుడు సయిన్యంబుల నొసగురత్నంబును కోరెను కోడలు వస్త్రాభరణంబులను సమృద్ధిగానిచ్చు రత్నంబు కోరెను. కాని బ్రాహ్మణునకు సమృద్ధిగా ధనము నిచ్చు మణిని బొందవలయునని యున్నది. ఈ సమాచారంబునే విప్రుండు విక్రమార్కున కెరింగించి తమలో భేదాభిప్రాయము లుండుటచే నలుగురును నాలుగు మణులనుగోరిరని జెప్పిన, అంత మహాదాన సంపన్నుడగు విక్రమార్కుండు చిరునగవు ముఖంబున చిందులాడ తన కడనున్న నాలుగు మణులను గూడ

నా బ్రాహ్మణున కొసంగివేసి, యాతని యానందమే తన యానందముగా భావించెను.

ఓభోజ సార్వభౌమా! వింటివా విక్రమార్కుని యుదారస్వభావము. అటువంటి గుణసంపద లున్నవారలే యీ సింహాసనంబు నధిష్ఠింపదగు గాని నీ వంటుల కనర్హు లన్న. పొమ్ము" అని యా సాలభంజిక నుడువ భోజుండును విక్రమార్కుని వితరణ గుణంబును శ్లాఘించుకొనుచు నిజసౌధమున కరిగెను.

---

## 5వ ప్రతిమ చెప్పినకథ

మరియొకనాడు భోజభూపాలుడు సింహాసనము నధిష్ఠింపబోవ నయిదవ సోపానము చెంతనున్న ప్రతిమ యతనిని వారించి యిట్లు చెప్పదొడగెను.

"ఓ భూప్రభూ! విక్రమార్కుని గుణాతిశయముల నీకు వినిపించెదను. విని చరితార్థుండవు కమ్ము' అని వెండియు నిటులు చెప్పదొడంగెను.

"మున్నొకపు డుజ్జయినీ నగరమున విలోచనుండను విప్రునకు నీశ్వర వరమున నొక కుమారుడు దుదయించెను. వానికి దేవదత్తుండను నామకరణ మిడి యా బ్రాహ్మణుడు వాని నల్లారు ముద్దుగా బెంచుకొనుచుండెను. ఆ బాలకునకు యౌవనారంభము కాగా నేవానికొక చక్కని కన్నియ నిచ్చి వివాహ మొనర్చి యావిప్రుండు భార్యాసహితుడై కుమారునకు కొంత ధనమునిచ్చి తీర్థయాత్రల కరిగెను దేవదత్తుడు నిజసతితో ధర్మపరాయణుండై సన్మార్గంబున కాలంబును గడుపుచుండెను. ఒక దినమున దేవదత్తుడు సమిధ పత్రంబుల గొనిరావలయునని వనమునకరుగ, విక్రమార్కుడు వేట తమకమున యావనమునకు వచ్చి డస్సి తెరవు గానక యొకచోట మూర్ఛనొంది యుండెను. దేవద

త్తుడంత చేరువ జలముల దెచ్చియు, తన వద్దనున్న మధుర ఫలముల నొసంగియు విక్రమార్కునకు కొంత సేదదీర్చెను. అంత విక్రమార్కుడు కొంత శ్రమను దీర్చుకొన్న యనంతరంబు తన్నెట్లయిన నుజ్జయిని జేర్పవలసినదని దేవదత్తుని కోరగా నతడట్లు జేసెను. విక్రమార్కుండును ప్రత్యుపకారంబుగా దేవదత్తున కొక గ్రామంబును సర్వహక్కుల తోను వ్రాసి యిచ్చి, మరియొకప్పుడు తగిన యుపకారము చేయుదునని జెప్పి పంపివేసెను.

అట్లు కొన్ని యేండ్లు గడచిన యనంతరంబు, విక్రమార్కుండు తన కుపకారంబు చేయుదునని యిచ్చిన వాగ్దాన మెంతవరకు నిజమో పరీక్షింపగోరి దేవదత్తు డొకనాడు వీధిలో సర్వాలంకారంబుల తోడను నాడుకొనుచున్న నొక కుమారుని వస్తువుల సహితంబుగా దొంగిలించి తన యింట దాచియుంచెను. ఆ బాలకుని యాభరణంబులలో నొకదానిని తన దాసి చేతికిచ్చి యంగడియందు విక్రయింపుమని చెప్పెను. యీ లోపున రాజకుమారుని జాడ కానరానందున తమ బంధువగు విక్రమార్కునితో నా బాలకుని తలిదండ్రులు మొరబెట్టుకొన నతడు తన పరిచారకుల నలువైపులకును బంపి బాలకుని జాడ దెలిసికొని రమ్మని యాజ్ఞాపించెను అందొక పరిచారకుండు యంగడి యందు వస్తువును విక్రయించుచున్న దాసిని బట్టుకొని యీ వస్తువు నెక్కడనుండి దెచ్చితివని నిర్బంధించి యడుగగా, నామె దీనిని దేవదత్తుడు తనకమ్మజూపుట కిచ్చెనని జెప్పెను. అంత రాజభటులు దేవదత్తుని వెంటనే బాధించి రాజు సమక్షంబున నిలిపిరి.

'ఓ రాజా! తరువాత కథను నీకు ఆరవ ప్రతిమ జెప్పును పొమ్ము" అని ఆ బొమ్మ చెప్పగా భోజుడట్లు చేయ నా ప్రతిమ వానికిట్లు చెప్ప నారంభించెను.

---

—♦ 6వ ప్రతిమ చెప్పిన కథ ♦—

"అంత నిండు సభయందు విక్రమార్కుండు దేవదత్తునిజూచి, "ఓయీ! ఈయాభరణములు నీకెట్లు వచ్చినది? బాలకు నేమిచేసితివి నిజము జెప్పుము. నీకు మేలు కాగలదు, అని నుడివెను. అంత దేవదత్తుండు అయ్యా! ద్రవ్యకాంక్షచే బాలకుని వధించి, ఆ యాభరణముల దొంగిలించితిని. యని నుడివెను. అంత విక్రమార్కుండు ఆశ్చర్య విషాదములు మనమున నిండుకొనగ "ఓయీ! ఎంతపని చేసితివి నీకు నేను గొప్ప మేలుచేయవలయునని యనుకొనుచుండగా నింతలో నీపని చేసితివా? ఎంతదారుణకృత్యము ఓసభాసదులారా! యీతని కేమి దండన విధింపవలయునో యోచింపుడు, అని విక్రమార్కుండు సభ్యులతోననగా, వారేకగ్రీవముగా, ఈదుర్మార్గునకు మరణదండన విధింపవలెను, ననిరి. అంత విక్రమార్కుండు దేవదత్తుని జూచి, "ఓయీ! సభాసదులు నీకు మరణదండనను విధించినారు. కాని దానివలన బాలకుండు తిరిగి రాడు కదా అదియునుంగాక నీవు నాకొకప్పుడు ప్రాణదానముం జేసిన నాడప్పు దానం జేసి యిపుడు నీకు నేప్రాణదానముం జేసి విడుచుచున్నాను. ఇంకెన్నండును ధనకాంక్షచే నిట్టి దుర్మార్గకార్యముల నాచరింపక నీకు ధనము వలయునపుడెల్ల నాకడ కరుదెంచుచుండుము. పొమ్ము, అనియెను

దేవదత్తుడంత విక్రమార్కుని దయాగుణంబునకు మెచ్చి, తానంతవరకును దాచి యుంచిన బాలకుని దెచ్చి యొప్పజెప్పెను. మరియు దేవదత్తుండు విక్రమార్కునితో సవినయముగా నిట్లనియెను. మహాప్రభూ! తమరు నాకింతకు మునుదొసరించిన వాగ్దాత్తమును మనమున నుంచుకొనిరో లేదో పరీక్షింప గోరి యిట్లొనర్చినాడను. దేవర వారు నాతప్పును మన్నింతురుగాక! యనియెను. మరణించెననుకొనిన బాలకుండు తిరుగ లభించి నందులకు విక్రమార్కుండు మిగుల సంతసించి, దేవదత్తుని బలువిధంబుల బహూకరించెను.

గులలో నొక్కడాపదల జిక్కుకొని ప్రాణంబులుబాయనున్నాడు. అంగు లకుమేమెల్లరమిట్లు విలపించుచున్నాము? అనిన నేనుతిరుగ వాని నిట్లు ప్రశ్నించితిని. ఆస్నేహితుడెవ్వడు. అతడెట్టియాపదలోనున్నాడు. దాని కినిమీకును నెట్లు నేస్తము కుదిరినది?" అంత నావిహంగము తిరుగ నిట్లు చెప్పమొదలిడెను.

మేమీ వింధ్యాటవిలో విహరించుచుండ నొకబోయవాని వలలో జిక్కుకొంటిమి అదేసమయంబున నొక విప్రవరేణ్యుడు ఫలపుష్పాదుల గొన నాప్రాంతమునకే యరుదెంచి, బాధితులమైయున్న మమ్ముగాంచి మిగుల జాలినంది మాయెల్లరను బోయవాని బంధములనుండి విముక్తు లంజేసెను. నాట నుండియు నా బ్రాహ్మణుండు మాకు ప్రాణమిత్రు డయ్యె. ఆ భూసురుండి వింధ్యాటవీ ప్రాంత గ్రామంబున నే వసియించు చుండును. ఆ గ్రామమున నొక బ్రహ్మ రక్కసుండు గలడు. ఆ గ్రా మవాసులు వంతుల ప్రకారము యొక యింటి మనిషియు,బండెడన్నమును గొన్ని పశువులను నా రక్కసునకు బలినిత్తురు. మామిత్రునకైన నావి ప్రునివంతు రేపువచ్చినది. అతడా బ్రహ్మరాక్షసునకు ఆహారముగా బో వుచున్నాడు గదాయని మేము విచారించుచున్నాము" అనెను. తను మి త్రునికై విచారించుచున్న యాపక్షికుటుంబము నే నెట్లూరడింపవలయు నో తెలియక సత్వరమున నేనిట కరుదెంచితిని అని యాపక్షి చెప్పుచు న్నప్పటికా పక్షులరేడు నిద్రించెను. అనంతరంబు మిగిలిన పక్షులు గూడ తమతమ తావులు జేరి నిద్రించెను.

'ఓ భోజరాజా! తరువాత నేమి జరిగినదియు, నీ కెనిమిదవవిగ్ర హము చెప్పగలదు" అని యా ప్రతిమ నుడువగా, భోజుండా విగ్రహా ముకడకేగ, నది యిట్లు చెప్పనారంభించెను.

## —♦ ౨౧ ప్రతిమ చెప్పినకథ ♦—

"ఓ భోజనృపతీ! అనంతర మేమిజరిగినదియు జెప్పెదను వినుము" అని వృక్షచ్ఛాయనుండి యాకథనంతయు నాలకించిన విక్రమార్కుఁడెట్లయిన నావిప్రుని ప్రాణముల రక్షింపఁగోరి వెంటనే బయలుదేరి వింధ్యాటవి ప్రాంతంబున కరుగు చున్న సమయమున నొక బ్రాహ్మణుఁడు బండెడన్నంబును, కొన్ని బసువుల దోలుకొని యారక్కసున కాహారంబుగా గొనిపోవుచుండెను. విక్రమార్కుఁ డాతనిగాంచి, 'ఓవిప్రనందనా! నీకు బదులుగా నేనారక్కసున కాహారంబగుదును. నీవు మారు బలుకక వెనుకకు మరలుము' అన నా విప్రుఁడట్లె యొనరించెను. రక్కసుండు ప్రతిదినంబును తన కాహారము వచ్చువేళ దాఁటుటఁజేసి మాడిపడుచు గుహపయి నెక్కి, దూరమునుండి మెల్లగావచ్చుచున్నవిక్రమార్కుని జూచి, మరింత కోపముతో నాతనిపై బడ నెగురేగెను. రక్కసుండు తనవద్దకే వచ్చుచుండుటను గని విక్రమార్కుఁడు మరింత మెల్లన నడప మొదలిడెను.

ఈలోపున నారక్కసుఁ డగుదెంచి విక్రమార్కునిపై బడెను. అంత విక్రమార్కుండు తన చంద్రాయుధంబుతో నా రక్కసుని రెండు ఖండములుగా గావింప నా ఖండములనుండి దివ్యతేజస్సుతో నొక బ్రాహ్మణు డుద్భవించుట గని విక్రమార్కుం డచ్చెరువంది వానితో 'ఓయీ! నీ వెవ్వరవు? నీకీ రాక్షసరూప మెట్లువచ్చినది" అని యడుగగా నా విప్రుఁడు విక్రమార్కునకు తనకథ నిట్లు చెప్పసాగెను.

'పూర్వము నేనొక మహాపండితుఁడనై యెవ్వరికిని విద్య చెప్పక తిరస్కరించుచుండు కారణమున నా గురువు నాపయి కోపించి, 'ఓరీ నీవింత గర్వంబుగ నుంటివిగాన వింధ్యాటవీ ప్రాంతంబున నొక బ్రహ్మరాక్షసుఁడవై జన్మింపు' మని శపించెను. అంత నేను వాని పాదముల పయి బ్రమొక్కి వేడ నాతఁడు కరుణించి, నీవు విక్రమార్కునిచే హతుం

ఏరాజ్యంబు మీనివాసంబుచే యోగ్యమయినది. యని యడుగ నాచెలియ సుదర్శనునితో నిట్టులనియెను.

అయ్యా! ఈవీణనుమీటుచున్నతన్వి గంధర్వరాజుకుమార్తెయగు హేమలత. ఈకాళికాదేవి యనుగ్రహమును బడయగోరి నిత్యము నిటకరుదెంచి యాదేవినిట్లు స్తుతించుచుండును. మీరెవ్వరో తాపసులవలెనున్నారు, ఇచటికి రాగతంబెద్ది? మావలనదము కేమయిన పనిగావలసియున్న యానతిండు? అనియెను. అంతజీమూతవాహనుని మిత్రుండా మెను తిరుగ యిట్లు ప్రశ్నించెను. మగువా! మీరాణి యిట్లనుదినంబునువచ్చి ఏకార్యసాఫల్యముం జెంద దేవియనుగ్రహముంబొందగోరుచున్నదో చెప్పవచ్చునా? అనియడుగ తనకుదగినవరుని గూర్పుమని యిద్దేవినారాధించుచున్నది. యని దెలియచెప్ప నాతడు ఓలలనామణి! నామిత్రుండగు సుదర్శనుండు మీయజమానిపై మక్కువ గలిగియున్నాడు హిమవత్పర్వత ప్రాంతమునంగల హేమనగరంబునకుభూపాలుండీతడు. రాజ్యపాలనమునందిచ్ఛలేనివాడై యీపరిసరారణ్యమున తాపసియైతల్లిదండ్రులకు సేవల జేయుచున్నాడని చెప్ప నాచెలియ దనయజమానురాలికీవృత్తాంతముం జెప్ప, హేమలతయు నంతకుముందే సుదర్శనుని గురించివినియుండెనుగాన. తానాతని వివాహమాడుటకు సంతసించి, తండ్రికీవృత్తాంతము నెరింగింప నాతడుపరమానందమున హేమలతనుసుదర్శనునకిచ్చి మహావైభవమున వివాహమొనర్చెను.

అంతవరకు విని, భోజుడు మూడుసోపానము నెక్కగా నందున్న ప్రతిమ వానికిట్లు చెప్పదొడంగెను.

—

—♦ 9వ ప్రతిమ చెప్పినకథ ♦—

"ఓభోజా! జీమూతవాహనుండును తలిదండ్రుల సేవల మరువక హేమలతతో సర్వసుఖముల ననుభవించుచు కాలము గడుపుచుండెను. ఇట్లు కొంతకాలంబు గడచిన యనంతరము జీమూతవాహనుండా యరణ్యంబున విహారించు సమయమున నొక ఘనసర్పంబు దుఃఖించుచుండుట నాతడు గాంచి, దాని విచారమునకు కారణంబు నడుగ నది వాని కిట్లు లనియెను

"దేవా! గరుత్మంతుండు తన కగుపించిన సర్పముల నెల్ల భక్షించుచుండ వానికి మేమొక ఏర్పాటును గావించితిమి. ఆయేర్పాటు ననుసరించి దినంబున కొకయొకటి సర్పమాతని కాహారముగావలయును' అన నుపదగ్గనుండు "భుజగమా! భయపడకుము. నీ కుమారుని కు బదులుగా నేను నేనా గరుత్మంతున కాహారంబయ్యెద' నని చెప్పి దానకై సర్పంబునకు బదులుగా యాహారమయి యా సర్పంబును విచారమునుండి తొలగించెను

అంత హేమలత తన విభుడు గరుత్మంతునకు నాహారమైనట్లు తెలిసి నమాటవిని కాళికాదేవిని గూర్చి యామె ఘోరతపం బాచరింప, కాళి యామెకు బ్రత్యక్షమై వరంబును గోరుమన, హేమలత యద్దేవి కిట్లనియె. "తల్లీ! నతు (?) పతిని గురించి యశోకము చేయుదా! గరుత్మంతున కెరయైన నావిభుని బ్రతికించి, నాకు పతిభిక్ష పెట్టుము. నా దేవి యుటయని జీమూతవాహనుని సజీవునిగా జేసెను. నాటనుండియు సుదర్శనుండు హేమలత గూడి తలిదండ్రులకు సేవలు చేయుచు సుఖముగ నుండె ఓవిక్రమార్క మహారాజా! నన్ను రక్షించి, శాపవిమోచన మొనరించి, విక్రమార్కునితో నిన్ను బోల్ప వచ్చునని రాక్షస స్వరూపంబును విడచిన యా బ్రాహ్మణుడు విక్రమార్కుని స్తుతించి చనియెను.

అంత విక్రమార్కుండును నుజ్జయిని కరిగి యథాప్రకారము రాజ్యపాలనము చేయసాగెను.

"ఓ భోజమహారాజా! విక్రమార్కుని సాహస వితరణాది గుణంబు లిట్టివి" అని యీకథ తెల్పగానే, నీవు సింహాసనము నెక్కదగవు పొమ్ము" అని యా విగ్రహము చెప్పగా భోజుడు సిగ్గుబడి వెనుకకు మరలి వెడలిపోయెను.

---

## —♦ 10వ ప్రతిమ చెప్పినకథ ♦—

మరియొక శుభముహూర్తంబున భోజరాజు సింహాసనము నధిష్ఠింపబోగా నందున్న సాలభంజిక యాతనికిట్లు మరియొక కథను చెప్పనారంభించెను.

'ఓ భోజరాజా! మున్ను వారణాసి పట్టణమున వేదశాస్త్రియను బ్రాహ్మణుం డొకడు గలడు. వానికి కన్యారత్న రూపలావణ్యనిధియగు కళావతి యను కుమార్తె యొకతె గలదు. వీరుడు, తాపసి, చతురుడు నను ముగ్గురు విప్రకుమారులా బాలామణిని ప్రేమించి యామెను దమకిచ్చి వివాహంబు చేయవలసిన దని వేదశాస్త్రి నడుగ నతడు వారికిట్లనియె 'అయ్యా! ఒక్కతె ముగ్గురకు భార్యయగుట పొసగాద హేతువుగాన మీలో నెవ్వ రామెను పరిణయంబు గావించి సుఖింపుడు. యెవరు పరిణయమాడుమనియు మీలో మీరే స్థిరపరచుకొనుడు" అతనా యువకులు ముగ్గురును నా బాలికకై వాదులాడ మొదలిడిరి. వారట్లు తగవులాడుచుండగా నొక భయంకర రాక్షసు డాకాశ మార్గంబునుండి యరుదెంచి కళావతిని యెత్తుకొని మింటికెగసి, పారిపోయెను. తన కుమార్తెను రాక్షసుండు గొనిపోవుటను గని, యామె తల్లిదండ్రులుమిగుల దుఃఖింపసాగిరి. ఆమెను పరిణయమాడ వచ్చిన యువకులు కూడ నట్టి సౌందర్యవతిని పోగొట్టుకొన్నందులకు మిగుల వాపోవ జొచ్చిరి.

అంత నామువ్వురలోను నొకడగు తాపసి "మిత్రులారా! నాదివ్యజ్ఞానప్రభావంబున రక్కసుండు కళావతి నెచటికి గొనిపోయి, యెంచుచినది యు జెప్పెదను. కాని యచటికేగ నావలను గాదు" అన చతురుండిట్లని యె, "స్నేహితులారా! తాపసి చెప్పిన తావునకు బోవ ననుకూలమైన యొక గొప్పరథమును నాబుద్ధిచాతుర్యముచే జేసి యిచ్చెద కానియా తావునకు బోవ నావలను గానిపని యని నుడివెను. అంత వీరుండు అన్నలారా తాపసి చెప్పినతావునకు చతురుండొనర్చిన యరదంబు నెక్కిబోయి, నాభుజవీర్యము జూపి, యారక్కసునింకునుమాడి కళావతిని దెచ్చువాడు అనియెను.

అంత తాపసి తనదివ్య దృష్టితో జూచి, యాథయంకర రాక్షసుండు కళావతినెట దాచినదియు చెప్పెను. చతురుండుతన చాతుర్యము ను జాటునొక యద్భుత రథంబును నిర్మించెను. అంత వీరుండారథంబు నెక్కి తాపసిచెప్పిన తావునకుజని, యారాక్షసునితో ఘోర యుద్ధము సల్పి, కళావతిని దనరథంబుపై నెక్కించుకొని వచ్చియాలేమను తలిదండ్రుల కడ జేర్చివారిపుత్రికా శోకంబును బాపెను.

ఓబోజరాజా కథనంతను వింటివిగదా ఆముువ్వుర యువకుల లోను కళావతిని వివాహ మాడ నెవరుతగుదురో నీనీబుద్ధి కుశలతను వినియోగించి చెప్పుము "అయ్యా తాపసియు, చతురుండును దమ విద్యాప్రభావంబుల మాత్రమె జూపగల్గిరి. కాని, వీరుం డు రాక్షసునితో ప్రాణంబులపై నాశవీడి. ఘోరయుద్ధ మొనర్చి, కళావతిందెచ్చినాడు. కాన నావీరుండె కళావతివివాహమాడ సర్హుండు" అని బోజుడుచెప్పెను అదివినిన ఆవిగ్రహము.'బోజరాజా నీయుత్తరం బెంతయు సమంజసంబు' అని చెప్పునప్పటికి కాలాతిక్రమణంబయ్యెనని బోజుడు ఆనాటికి వెడలి పోయెను

## —♦ 11వ ప్రతిమ చెప్పినకథ ♦—

ఆ మరుచటి దినంబున భోజుండు వివిధాలంకారములచే నలంకృతుండయి, విక్రమార్కుని సింహాసనము నధిష్టించుటకు గారా, పదకొండవ సోపానమునందున్న విగ్రహము వానికిట్లు చెప్పదొడంగెను.

“ఓ భోజ రాజచంద్రమా! జంబూద్వీపమునకు సమీపమున నుండు నొకయగ్రహారమున గోవిందుడను విప్రుండొకడు కలడు. వానికి ఇందుమతియను పుత్రికయు, దామశర్మయను కుమారుండును గలరు. అతనికితండ్రిసకలవిద్యల జెప్పించినిర్విచారముగనుండునంత, యిందుమతిని దనకీయవలసినదిగా గోరెను, ఆవిప్రకుమారుండు యోగ్యుండగుటం జేసి, తనకుమార్తెనాతనికీయ వాగ్దానమొనర్చి, యీసంగతి నింటిలోని వారి కెవ్వరికును జెప్పకుండెను. అతఁడొకనాఁడు వేరొకవిప్రకుమారుండు గోవిందుని భార్యయగు గుణమాలికకు కనుపించి, యిందుమతినిదనకిచ్చివివాహము జేయుమననామెయిల్లాలు బ్రాహ్మచారి యోగ్యుండనియెరిగితనకుమార్తె నాతనికిచ్చుటకు బాస యొసంగెను. అనంతరము వేరొకనాఁడు మరియొక బ్రాహ్మణయువకుఁడు రామశర్మ కుశలపడి యిందుమతిని దనకీయ వలసినదిగా గోర నతఁడా విప్రనందనుఁడు యుక్తుండగుటచే దన చెల్లెలి నాతనికిచ్చిబరిణయమొనర్చుటకు మాటయిచ్చెను. ఆ ముగ్గురులోను నొకరికి దెలియకుండ నొకరు, యిందుమతిని వేరువేరుయువకులకీయుటకు వాగ్దానమునిర్ణయించిరి. ముగ్గురు నేర్పఱచినముహూర్తమునొకటే యగుట చే నా ముహూర్తమునకే ముగ్గురు పెండ్లికొడుకులు నరుదెంచిరి. అంతనాకుటుంబములోని ముగ్గురునునొకరికి దెలియకుండనొకరువాగ్దానములనొనరించుట చేగలిగిన ప్రమాదమని మిగులవిచారించిరి పెండ్లికొడుకులముగ్గురును ఇందుమతినాకుగావలయునని నాకుగావలయునని కలహంబులాడ దొడంగిరి. నామాటచెల్లవలయునని, నామాటచెల్లవలయునని యాకుటుంబములోనిముగ్గురు పెండ్లిపెద్దలును వివాదపడ

జొచ్చిరి ఆకలహంబులదీర్చువారెవరు? క్రమముగా వారి పోరుపెరుగుచుండెను.

అంతకలహంబులన్నింటికి దానేకారణముగదాయనియెంచి, యిందుమతియేరినిదెలియకుండ నురిపోసుకొని మరణించెను. ఆమెమరణమునకు తలిదండ్రులును సోదరుండును మిగులవిచారించిరి. ఆమెనుపెండ్లాడవచ్చిన విప్రనందనులును మిగులవగచిరి. అంతనామె తలిదండ్రులుమహాదుఃఖముననిందుమతికళేబరమునుదహనచర్యలనాచరించిరి ఇందుమతిపై మక్కువదీరకనామువ్వుర బ్రాహ్మణయువకులును శ్మశానమునకరిగి, కూరి అనంతర మువ్వురిలో నొకండువిరక్తుండై దేశాటనమునకరిగెను. రెండవవాడాలేమపైదనకుగల వలపుదీరక. యామెశల్యముల గొన్నిటినిమూటగట్టుకొని పోయెను. మూడవవాడాశ్మశానమునందే యిందుమతిని మనంబునస్మరించుకొనుచు, నివసించుచుండెను.

గొన్నాళ్లకు దేశాటనమునకరిగినవిప్రకుమారుడొక గృహిణిగని తనకాతిథ్య మీయుమనికోరగానామెవల్లెయని వానికివిందుసేయ వంటకములదయారుచేయుచుండెను. అప్పుడామె కుమారుండగు నయిదేండ్లవాడు మారాముపెట్టితల్లిని వంటజేసుకొననీయకుండ వేధించుచుండెను. అంతనాగృహిణిసుతునిపైగోపించి, నొకకరవాలముతో నాబాలకుని వధించిచంపెను. అతిథియై యరుదెంచినయావిప్రుండా ఘోరమునుజూచి యాగృహిణితో "అయ్యో! ఇదేమి దారుణము తల్లీ! కొంచమల్లరిసినంతమాత్రము నెవ్వరైనగన్నబిడ్డనుజంపుకొందురా? ఇట్టికఠినాత్మురాలవగు నీయింటినేనుభుజింపనొల్ల'నని పోబోవుచుండ నావిప్రునిగని, నవ్వుచునామెయిట్లనియెను.

"అయ్యా! మాకిదికొత్తకాదు. నేనుదినంబును పనిపిల్లవధించుచుందును. ఇందుజరిగిన ప్రమాదంబెద్దియులేదు. రండు మీరును నా బాలకునకును నొకేసారి వడ్డింతును. "అననామెయమ్మ మాటలకచ్చెరు

వంది, యీయామె పిచ్చిదిగాబోలు, లేకున్న చచ్చినబాలకుండెట్లువచ్చు, న
ని చింతించుచుండ నాయిల్లాలొకసంజీవివేరును పోపుపెట్టెలోనుండిదీసి,
మృతుడైనను తుదకు దాకింప వాడు నిద్రనుండిమేల్కాంచిన వానిపగి
ది లేచికూర్చుండెను. ఆమహాద్భుతంబుగనిన విప్రకుమారుడాయిల్లాలికిన
మస్కరించి 'తల్లీ! నీశక్తి నెరుంగలేకపోతిని క్షమింపుము. నేను ప్రేమించి
నబ్రాహ్మణసుత యొకతె మృతయైనది. నీవానంజీవివేరును నా కొసగితి
వేని నామెను బ్రతికించుకొని, పెద్దాడి నీపేరు చెప్పుకొనుచు నామెతో
సుఖింతు" నన నామెకరుణించి నాసంజీవివేరు నాతనికిచ్చి 'అయ్యా! మృ
తులైనవారిశల్యములైననుసరే యున్న నీసంజీవివేరును నాటికిదాకింపుము
అపుడు చచ్చినవారు బ్రతుకుదురు' అనెను అనంతరమావిప్రుడాయింట
తృప్తికరంబుగా భుజించి, సంజీవివేరుగొని, కడురయమున నిందుమతి
దహింపబడిన తావునకరుగ, నప్పటికి శల్యంబులగొనిపోయిన విప్రసు
ను, నామె నామంబును స్మరించుకొనుచున్న బ్రహ్మచారియు, నాస్మ
శానంబునందే విలపించుచునుండిరి. అంత సంజీవినిదెచ్చిన బ్రాహ్మణుడు
మిగిలినవారినిజూచి, మిత్రులారా! నాకడ సంజీవివేరొండుగలదు. ఇందు
మతి శల్యములనైన నున్నయెడల నేనిందుమతిని బ్రతికింపగలనన నొక
బ్రహ్మచారి సంతసమున తనవద్దనున్న యెముకల మూటవిప్పి యెదుటబె
ట్టెను. మరియొకడా శల్యంబులనంటిని నతికించి మనుష్యాకృతిం జేసెను.
అనంతరంబు మూడవవిప్రుండనుడు తనవద్దనున్న సంజీవినిదీసి, యాయ
స్థిపంజరమునకు దాకింప, నిందుమతి సజీవయై సర్వాలంకార భూష
ణములతోడను నరుదెంచి ముగ్గురు బ్రాహ్మణకుమారులకును నమస్క
రించెను. అంత హారాబాల నామె తలిదండ్రులకడకు గొనిపోయి జరిగి
నవృత్తాంతము నంతను వారి కెరిగించిరి. వారు తమపుత్రిక తిరుగ బ్రతి
కివచ్చినందులకు మిగుల సంతసించిరి. కాని, యిపుడుమాత్రమామెనెవ
నేరికిచ్చి వివాహము చేయుట? ఆ సమస్య యప్పటికిని నిప్పటికిని గూడ

తీరనేలేదు.

ఓ భోజరాజా! ఈధర్మ సందేశమును నీవు తీర్పగలిగిన మొదల నీ సింహాసనము నధిష్టింపుము. లేనిచో నీవద్దాని నెక్కుట కనర్హుండవని యా విగ్రహాము చెప్పగా భోజుడా చిక్కు ప్రశ్నకు సమాధానము చెప్పజాలక సిగ్గుపడి, నాటికి ననుకకు మరలెను.

---

## ♦ 12వ ప్రతిమ చెప్పినకథ ♦

అనంతరము మరొక శుభముహూర్తమున భోజుడువిక్రమార్కుని సింహాసనంబు నధిష్టింప సర్వాంకృతుండై జనినంత పన్నెండవ సోపానమునందుగల ప్రతిమ వాని నడ్డి, 'ఓ భోజభూపాలాగ్రణీ! విక్రమార్క సార్వభౌముని యందుగల మహోదారతా గుణంబులలో నొక్క పరిమాణమైన నీకడ లేదుగదా! యట్టి తరి నీవీ సింహాసనము నధిష్టింపనేల సంసిద్ధుడ వగుచుంటివి. ఆతని మహోదారత గుణంబులును, సాహసంబులును తెలుపు నొక కథను జెప్పెద సావధానుండవయి యాలకింపుమన భోజుండందులకు సమ్మతించి, యా ప్రతిమ చెప్పు కథను శాంతమనస్కుండయి యాలకింప దొడగ, నా విగ్రహమీ క్రింది కథను జెప్పసాగెను.

"విక్రమార్క మహీపాలుని ముఖ్య పట్టణంబగు నుజ్జయినీ పురంబున ధనంజయుడను నొక గొప్ప వైశ్యుడు గలడు. ఆతడు తనకుసంతానము లేకపోవుటను జేసి, యొకనా డిట్లు తలపోసెను.

'నా యనంతరంబు నా భాగ్యము ననుభవించుట కెవరును లేరు గదా! అట్టి తరి నేనీ ధనంబును వెచ్చించి ముందు జన్మంబునకు తరుణోపాయంబు నేల జూచుకొనగూడదు. అదియే నే నార్జించిన ధనంబునకు సద్వినియోగము. అని నిశ్చయించి యామరునాడె తీర్థయాత్రలకుబయలుదేరి కాశి, ప్రయాగ మున్నగు తీర్థంబుల సేవించి, గో హిరణ్యాది

షోడశమహాదానంబులను గావించి, యనంతరము మార్గమునం గల నొక భైరవాలయము కడనాగి, యచటి సరోవరంబున స్నానమాడి, భైరవస్వామిని దర్శింప దేవాలయములోని కరుగ నాతనికి గనుపించిన శిలాశాసనంబున నిట్లు లిఖింపబడి యుండెను.

"ఈభైరవమూర్తి సన్నిధానంబున నెవఁడు తన శిరము దాను నరుకుకొనునో, వతఁడు రెండుప్రాణముల రక్షించినవాఁడగును. అదెట్లన నీదేవళమునకు వెనుక రెండు ఖండింపబడిన శిరములు గలవు వాటి మొండెములును నచటనే గలవు. పుణ్యమూర్తి యెవఁడను దనశిరము నీభైరవుని యెదుట ఖండించుకొనునో తక్షణం బాశిరములు తమ మొండెము గలసుకొని సజీవములగును."

ఈవృత్తాంతము జదివిన ఘనరాజయునికి గుండెలలో దడపుట్టె. నిక తీర్థయాత్రలమాట దైవమెఱుఁగు బ్రతుకు జీవుడా యని తక్షణం బె తన స్వగ్రామముం జేరి యావృత్తాంతమును ప్రభువగు విక్రమార్కున కెరింగించెను. అంత సాహసోపేతుండగు విక్రమార్కుం డావృత్తాంతము దెలిసికొనవలయునని తనపాకమోక్క సహాయంబున గను రెప్పపాటులో భైరవాలయమును జేరి, యచట శాసనమునందలి వృత్తాంతమును సాంతముగా జదివి, తనలో నిట్లు వితర్కించెను.

"పరోపకారార్థ మిదం శరీరం అను నార్యోక్తి ననుసరించి, నేనొక్కండను మరణించి యిరువుర ప్రాణంబుల గాపాడం జెప్ప అదియు నుగాక, పుడమిపై నొక్కండు జీవించుట కంటె నిరువురు జీవించుట యోగ్యతమము, అని నిశ్చయించి, వెంటనే తనమొలనున్న కరవాలము దీసి, యాయుగ్రభైరవుని సన్నిధానమున తన కుత్తుకను గోసుకొన నుసిద్ధుండు కాగా నంతట భైరవుండు విక్రమార్కునకు బ్రత్యక్షంబై "వత్సా! ఆగుమాగుము నీసాహసంబునకు మెచ్చి వరము నీయువాడను! కోరుము.' అన విక్రమార్కుండు భైరవునకు నమస్కరించి స్వామీ

మృతులై మొండెములతో నున్న నావిగతజీవుల సజీవుల జేయుము
ఇదియె నాకోర్కె, అనియెను. అంత భైరవుండట్లె జేయ, మృతులైన
నారెండు జీవులును ప్రాణంబులతో వచ్చి విక్రమార్కు పాదంబులకు
నమస్కరించెను. అందొకటి స్త్రీమూర్తి, రెండవది పురుషమూర్తి.

అంత విక్రమార్కుండు "అయ్యా! వీరెవ్వరు? ఇట్లు ఖండింపబడి
మరణించుటకు గతంబెద్ది? వీరి వృత్తాంతముం జెప్పుమన భైరవుండు
విక్రమార్కునకు వారి వృత్తాంతము నిట్లు చెప్పదొడంగెను. ఓ భోజరా
జా! ఆవృత్తాంతమును నీకును మున్న బొమ్మ చెప్పగలను. పొమ్ము" అని
చెప్పి, భోజుడా విగ్రహముకడకుబోయి, దానిని ప్రార్థింపగా నదియిట్లు చె
ప్పదొడంగెను.

---

## — పదమూడవ ప్రతిమ చెప్పినకథ —

"విక్రమార్క భూపాలా! ఇతడు రత్నభద్రుండను వైశ్యకుమా
రుండు. ఈయువతి వాని భార్య. వీరి మరణంబునకు గారణంబును జెప్పె
ద నాలకింపుము. ఒకనాడు రత్నభద్రుండు వ్యాపారార్థము జనును
మార్గంబునగల యీ యాలయంబున బసచేసెను. అదే సమయంబున
చంద్రకేతుడను మరియొక వైశ్యకుమారుడు గూడ నిచటనే బసచేసెను
రత్నభద్రుండు చంద్రకేతుని నాతడెక్కడకు బోవునదియు, యేకా
ర్యార్థ మరుగుచున్నదియు నడుగ దాను సుధానగరమను పట్టణంబు న
చటగల పద్మావతియను వైశ్యకుమార్తెను వివాహమాడ జనుచుంటిన
నియు, ఆ బాలిక దండ్రికి మిత్రుడగు తనస్నేహితుడు తన్నచటికి బం
పుచుండెననియు జెప్పెను. ఆ సమాచారంబును విన్న రత్నభద్రుడం
తకు ముందే పద్మావతి యొక్క సౌందర్యాది గుణంబుల బలునోళ్ళవినియు
తడామెపై మనసు నిలిపియుండుటచే యిప్పుడు చంద్రకేతు నెటులయిన
యచటికి జనకుండ జేసి, తానె బోయి యాకన్నియను బడయగోరిచం

ద్రకేతునితో నిట్లనియె.

"అయ్యా! పద్మావతిని నా కిచ్చి వివాహము చేయుట కింతకు ముందే నిశ్చయింపబడినది. రేపె శుభముహూర్తము. నా బంధువులకై నేనిచట వేచియుంటి. తా మనవసరముగా శ్రీమనందక యిటనుండియే మరలుటలెస్స' యనగా చంద్రకేతునకా మాటలయందు విశ్వాసములే కఅందేదియో మోసమున్నదనియెంచి యప్పటికి సరియేయని వెడలిపో యెను. అంతట రత్నోద్భవుండు తనకొట్టి నేతిలో పడినదని యెంచివెం టనే తాను సుధానగరమునకు పయనంబాయెను. పోవుటకుముందాతడు నన్ను దర్శించి, పద్మావతిని దాను వివాహమాడగ్గిసచో దనశిరంబు నునాకు కానుకగానిత్తునని మొక్కుకొనియెను. ఇతడు సుధానగరము జేరుసరికి చంద్రకేతుడు కూడ నచట సిద్ధమాయెను. పద్మావతి తండ్రి వారియుపురను గౌరవించి, కొన్ని పుష్పములను రత్నోద్భవునకును, గొన్ని పుష్పములను చంద్రకేతునకును నిచ్చి నవి యీశ్వర ప్రసాదంబుగా జెప్పెను. చంద్రకేతుడు వాటిని కన్నుల కద్దుకొనియెను. రత్నోద్భవుం డట్లు చేయక వాటిలో గొన్నింటిని యచట నున్నవారల కొసంగి మిగిలి న వాటిని కన్నుల కద్దుకొని తన శిరంబున దాల్చెను. ఈ దృశ్యమును గనిన పద్మావతి ఈచంద్రకేతునికంటె రత్నోద్భవుండు పరోపకారశీలు డని యెంచి, తానాతనినె వరించెను రత్నోద్భవ పద్మావతులకతివైభ వముగ వివాహంబు జరిగిన యనంతరంబు, చాల దూరమునుండి శ్రమ పడివచ్చిన చంద్రకేతు నూరకబంపుట యుక్తముకార్యము కాదని యెంచి పద్మావతి చెలులలో సుగుణ మతియను నామెను చంద్రకేతు నకు పరిణయము గావించిరి.

కొన్నిదినము లత్తవారింట నుండిన తదనంతరము చంద్రకేతుం డు తన కాపురస్థలంబు రత్నద్వీపమునకు భార్యాసమేతుండై చనియె ను అంత రత్నోద్భవుండును తన దేశమున కరుగను నని మామగా

రి యొద్ద సెలవుపుచ్చుకొని పద్మావతీసహితుండై పయనంబై మార్గ
మునంగల నాదేవాలయమున బసచేసెను. ఆరేయి భార్యయగు పద్మా
వతి నిద్రించుచుండు సమయంబున రత్నోద్భవుండు తాను నాకొసంగి
న మొక్కుపరిహారము కత్తితో కంఠమును నరుకొని నాసన్నిధానమున
మరణించెను. మరికొంత తడవకు పద్మావతి మేల్కాంచి తన భర్త
మృతకళేబరముం గాంచి, భయవిభ్రాంతయై యాతని నెవరు హత్యగా
వించినదియు దెలిసికొనజాలక, కొండొక తడవు విచారించి, యంతగం
బు తానుకూడ నచటి కత్తితో పొడుచుకొని భర్తృశరీరము చెంతను
రణించి వీరరమణియైయెంది. ఈపుణ్యదంపతుల దియ నెట్లయిన బ్రతికింప
గోరి యిచటి శాసనమును నేవటవ్రాయించితిని. నేటికి నీయనుగ్రహం
బున నీదంపతులు సజీవులయిరని నుడివి భైరవుండదృశ్యుండాయెను.
పద్మావతీ రత్నోద్భవులు తమకు ప్రాణభిక్షబెట్టిన విక్రమార్కుని
బలువిధంబులగొని యాడి తమదారిని దాముపోయిరి. అంతవిక్రమా
ర్కుండును నుజ్జయినీపురంబు జేరుకొనియెను, అని ఆప్రతిమ తను చె
ప్పవలసిన కథను సాంతము ముగ్గించి, ఓభోజభూపతీ! వింటివా విక్రమా
ర్కుని వితరణగుణంబు? ఇపుడైన నితని సింహాసనము నధిష్ఠింప నీవు
తగుదవని దెలిసికొని మరలుము, అనగా భోజుడేమియు బలుకజాలక
యప్పటికి దన ప్రయత్నమును విరమించుకొని చనియెను.

---

## —♦ 14వ ప్రతిమ చెప్పినకథ ♦—

విక్రమార్క సార్వభౌముని సింహాసనము దానధిష్ఠింపవలయు
నని కోర్కెయుండు భోజుని విడనాడుటచే పతము నతియొక పుణ్యం
బున సర్వసన్నాహంబులతోను నాసింహాసనము నధిష్ఠింపబోవ పదునాల్గ
వ సోపానవిగ్రహము వానినాటంకపరచి, 'ఓభోజరాజా! విక్రమార్కునకు
ను నీకును హస్తికాంతరవతాంతమ్యముగలదు. అట్టి తరి నీవాతనిసింహా

సనము నధిష్ఠింపజూచుట కూడనిపని, ఆమహానీయుడు రాజ్యపాలన మొనరించిన కాలములో నాతనిజీవితములోని నొక సాహసఘట్టమును నీకు జెప్పెదవినుము" అన భోజుండును విక్రమార్కుని జీవితములోని మరియొకఘట్టమును గూడ వినగోరి, "ఓబొమ్మా! అట్లెచెప్పుము. విక్రమార్కుని జీవిత కథల నెన్ని విన్నను తనివి తీరదు." అన నావిగ్రహ మిట్లు చెప్పదొడంగెను.

"ధర్మము నాలుగు పాదములనడువ విక్రమార్కుండు సమర్థుండగు మంత్రి భట్టిసాయమున రాజ్యపాలనమును జేయుచున్న కాలమున నతని రాజ్యమున గోపాలశర్మయను నుత్తమ విప్రుండు బహుకాలమునపత్యుడై యుండి, సంతానము కొరకనేక క్రతువ్రతములను, వ్రతములను జేసిన యనంతర మతని కొక్క పుత్రుండు కలిగెను. శర్మయునా బాలునల్లారుముద్దుగా బన్నెండేళ్ళ వరకు పెంచి, వానినప్పటికే యున్న విద్యల యందును నుత్తీర్ణుం జేసి, యొక దినంబున వాని సముద్రస్నానంబునకు గొనిపోయెను. ఆబాలకుండును నందు స్నానమొనరించి శుచియై సూర్యభగవానునకు సగము నీటిలో నిలచి, యర్ఘ్యమిచ్చుచున్న సమయంబున, సముద్రాంతర్భాగమునుండి యొక మొసలి యరుదెంచి, యావిప్ర కొమరుని శర్మచూచుచు డగనే మ్రింగివైచి, సముద్రగర్భమున మునిగిపోయెను. అంత గోపాలశర్మ గోలుగోలున నేడ్చుచు నేమియు చేయునది లేక విక్రమార్కుని కడకు జని "అయ్యో! నాపుత్రుని మొసలిమింగినది. ఏది దారి? రాజా నీవు ధర్మాత్ముడవనియు, నీపాలనము ధర్మపాలనమనియు నెల్లరును గొనియాడు చుండ నీపాలనమున నీయ ధర్మకార్యమేమి? నాకంటె నా పన్నెండేండ్ల పుత్రుడే మరణించుట నీపాలనము నేదయో యధర్మము జరుగుచున్నది. లేనిచో నాపుత్రుం డిట్లు ఘోరమరణము నందడు. కనుక నాపుత్రుమరణంబునకు నీ వే కారణుండ వేమి చెప్పెదవు?, యన విప్రవచనంబులకు విక్రమార్కుం

డేమియు బలుకజాలక యొకింత తడవాలోచించి "విప్రసత్తమా! కొద్ది కాల మోపికపట్టివిచారము దక్కియుండు. నీపుత్రుఁడేలోకమునను న్నను ఎట్టిఘోరుణబంధనములో నున్నను ముల్లోకములను గాలించి యైనను నే దెత్తును. నీకుమారుని దెచ్చువరకును నాముఖము నేటికినిజూప, నని చెప్ప నావిప్రుండు విక్రమార్కుని సమర్థత నెరింగివాడగుటచే విచారము దక్కి చనియెను.

అంతవిక్రమార్కుండు భట్టిని రావించి, జరిగిన వృత్తాంతము నా తనికి జెప్పి, తాను తిరిగి బ్రాహ్మణ సుతుని దెచ్చువరకును జాగ్రత్త తో రాజ్యపాలనము జేయుమని చెప్పి, తానుహుటాహుటింజని, కాళి కాలయమ్ముం బ్రవేశించి, దేవికి సాష్టాంగపడి లోకజననీ! బ్రాహ్మణకు మారుని దెచ్చు నుపాయంబు నాకుజెప్పి నాగౌరవము నిలిపితివా సరి యె లేకున్న నిదే నీపాదసన్నిధానమున హతుడగుచాడ, నని మొలనుండి కత్తిదీయునంతలో దేవి ప్రత్యక్షంబై విక్రమార్కున కొక పట్టుదోవతి యు, నొక వీబూదిపండును నిచ్చి, వాటి నుపయోగించు విధానముం చెప్పి, బ్రాహ్మణ బాలకుండు తప్పక లభించి, తీరుటయేగాక, యింక ను ననేక శుభంబులగు నని విక్రమార్కుని దీవించిపంపెను

ఓభోజనృపతీ! నేనంత వరకె యెరుంగుదును. తరువాయివృత్తాం తమును నీకుపదునెనవ విగ్రహముచెప్పును పొమ్ము" అని యావిగ్రహ ము చెప్పగా భోజుడట్లుచేసెను.

---

## —♦ 15వ ప్రతిమచెప్పినకథ ♦—

అంతట పదునేనవ సోపానమునందున్న ప్రతిమ భోజునకిట్లు చె ప్పదొడంగెను అంతటవిక్రమార్కుండే కాకియై బ్రాహ్మణుండు చెప్పి న చొప్పున బాలకుని మొసలుమ్రింగిన సముద్రముకడకు జని, కాళి కాదేవి యిచ్చిన పట్టు దోవతిని సముద్రముపైదేల విక్రమార్కుండు దే

విందలంచి యుండాసీనుడై సముద్రాంతర్భాగంబునకు జని యెను. అట్లుకొంత దవ్వరిగిన యనంతరంబు విక్రమార్కుండు తనవద్దనుండు పీ బూడిని గొంత దీసి యా సముద్రంబున వేయగా, నంతట ప్రళయకాల ధ్వనిం జేయుచు మున్ను బ్రాహ్మణ బాలకుని మ్రింగిన మొసలు యరుదెంచి, విక్రమార్కుని గూడా నొక్క పెట్టున మ్రింగివైచి, వానిని నగాధంబునకు గొనిపోయెను. మొసలు గర్భగోళంబు బ్రవేశించిన విక్రమార్కుండా ప్రదేశమంతయు నొక మహాపట్టణంబుగా జూచి, దాని రామణీయకమున కచ్చెరువందెను. మొసలి గర్భములో నున్న యామహాపట్టణంబులో వింతల జూడగోరి విక్రమార్కుండు బయలుదేరి,యానగరంబు నందుగల దివ్యహర్మ్యములును, శిల్పనాచాతుర్యంబునుట్టిపడ జేయు విగ్రహాంబులతో నిండిన పెక్కు గోపురములను దిలకించుచు, వచ్చుచుండ నొక బాలకుం డాతని కెదురై అయ్యా! తాముజ్జయినీపురాధీశ్వరులగు విక్రమార్కులుగదా! ఇచటికెందులకు వచ్చితిరి? ఎట్లురాగలిగితిరి? యని యడుగ యా నూతన బాలకుడు తన్నెరుంగుట కచ్చెరువంది, ‘అవును. నేను విక్రమార్కుండనే నీవెవ్వరు? ఈపట్టణమంతయు నిట్లు మహాద్భుతంబుగా నున్నదేమి? నీవు నన్నెఱుంగుదువు” అని ప్రశ్నింప నా బాలకుండు విక్రమార్కున కిట్లనియెను. రాజోత్తమా! నేను యుజ్జయినీ పురమున గోపాల శర్మయను బ్రాహ్మణున కేక పుత్రుండను. నిన్ను మ్రింగిన మొసలయే నన్నును మ్రింగ మాజనకునిదుఃఖవారాసిని ముంచి యిట్లు నాగలోకమున చిక్కుపడి యుందుచుంటిని. విక్రమార్కుడా బాలకుండే శర్మ కుమారుడగుట కెంతయు సంతసించి బాలకా! మీ తండ్రి నీ కయి దుఃఖించు చుండ నేను నిన్ను దోడ్కొనిపోవ యిచటి కరుదెంచితిని. ఇచట మన ముండవలసిన పనిలేదు. మన యుజ్జయినికి పోవుదము బద యని తన పట్టుదోవతి నీటిపై బరచి బ్రాహ్మణ బాలకునితో నందు గూర్చొనియెను. ఆ చీర తొల్లిటివలె గాక

నల్లకల్లోలముగానున్న నాసముద్రముపై తనయిచ్చవచ్చిన తెరంగున బోయి పోయి. యొకద్వీపముం జేరెను.

---

## —♦ 16వ ప్రతిమ చెప్పినకథ ♦—

అనంతరము భోజుడు ముందుసోపాన మెక్కగా అందున్న ప్రతిమ యిట్లు చెప్పెను.

"విక్రమార్కుండావిప్రకుమారునితో నాద్వీపము దరిదిగి, పట్టుధోవతిని తిరుగమడతపెట్టుకొని, యొండుబోవుటకు దెలియజాలకయున్నంత, వారి కొక బాటకనుపించెను. విక్రమార్కుండు బాలకుని సహితముగా నామార్గమునుబట్టి బోవ నదియొక సుందరపట్టణముగుటకు గొంతవరకు సంతసించి, యాపట్టణములోని కరిగి చూడ నాపట్టణము నాదెందములకో గాని యన్నిదిశల బ్రహ్మాండముగా నలంకరింపబడి, యెటుజూచినను మంగళవాద్యములతో జెలరేగెచుండెను. విక్రమార్కుం డొకసత్రమున బసచేసి, దాని యజమానితో "అయ్యా! నిదేద్వీపము? నేడిట్లుమహావైభవంబుతో నలంకరింపబడుటకు గారణమేమి? యనియడుగ నాసత్రాధికారి 'అయ్యా! యిది యశ్వమేధికాద్వీపము. విష్ణుదత్తుండనువాడు దీని కధిపతి. విష్ణుదత్తునకు త్రిలోకసుందరి నామధేయురాలగు నొకకుమార్తె. పేరునకు దగిన మోహానాంగి యొకతెగలదు నేడామెకు స్వయంవరమహోత్సవము జరగనున్నది. నానాదేశంబులనుండియు నెల్ల రాజులును వచ్చి విడిదిలయందు బసలు గావించిరి. సమయమునకు వచ్చితివి గాన నీవు గూడ నీయుత్సవముం దిలకించి జనుము, అన విక్రమార్కుండందుల కిచ్ఛలేనివాడుగా నటించి, 'అయ్యా! నేనొకకార్యార్థినై జనుచుంటిని, అనతికాలంబులోనె తిరిగివచ్చెదను అంత దనుక తమ రీబాలకుని తమయొద్దనుంచుకొని కాపాడగోరెదనని చెప్పి యాసత్రాధికారికి గొంత ధనము నిచ్చి, బ్రాహ్మణబాలకునం

దుంచి, తాను యమూరిబయటికి జని బేతాళుని మనమునం దలంచి, కొన్ని రత్నములను మరికొన్ని వలయు పరికరంబులను దెప్పించి, తానొక రత్నాలవర్తకుని వేషముం ధరించి, తిరుగ నగరిలోని కరుదెంచి, స్వయంవర మండపముచెంత వచ్చిన రాజులకెల్లరకును మణులనమ్ముచుండెను. ఇంతలో స్వయంవరమునకు వేళయైనదని చెప్పుట కొకగంట మ్రోగింపబడెను నాణ్యమైన యామాణిక్యముల బేరమాడుచున్న కొందరు రాజులు తాము తిరుగవచ్చునప్పటి కావర్తకుండు వడలిపోవునేమో యను భయంబున వానిని గూడ తమతో దీసికొనిపోయి దముచెంత గూర్చుండబెట్టుకొనిరి.

అంతట త్రిలోకసుందరి నిరుపమానలావణ్య పరిశోభితయై సర్వాలంకారభూషితయై, సుందరమనయై తనచెలులతోవిచ్చేసి, బారులు దీర్చి గూర్చొనియున్న రాజలోకము నొక్కమారు క్రీగంట దిలకించి, యెవనిని మగనిగా గోరుకొందునా యని మనమున నాలోచించుచుండ యచటి భూపతులెల్లరును నామె సౌందర్యాతిశయంబులకు దిగ్భ్రమజెంది, శిలావిగ్రహముల పగిది యట్లె చేష్టలు దక్కి త్రిలోకసుందరిం దిలకించుచుండిరి. అంత రాజనందన కరుణాకటాక్షము లోకమాన వర్తకుని వేషంబున గూర్చొనియున్న విక్రమార్కునిపైబడ, నామె యాతని సుందరరూపమును మోహించి, తనచేతియందున్న పూలహారము నాతని మెడయందు వైచెను. ఈవిపరీతముం గాంచిన యచటి రాజలోకమంతయు నాశ్చర్యమంది యీపరాభవంబును భరింపజాలక ఛీ! ఛీ! ఇంతమంది మహారాజులుండ, యొకవర్తకుని వరించిన యీపరువు తక్కువ రాజకుమార్తెయొక్క ముఖము జూడరాదు” అనియెల్లరు వెడలిపోయిరి. ఓభోజరాజా తరువాయికథ నాకు తెలియదు. యిందున్నప్రతిమనడుగుము.” అనిఆబొమ్మచెప్పగా. భోజుడట్లు చేసెను. అంతట నావిగ్రహము భోజునకిట్లు చెప్పెను

---

## —♦ 17వ ప్రతిమచెప్పినకథ ♦—

ఓభోజరాజా! తరువాయికథనాలకింపుము తాను మోహించిన పురుషుం డొక వర్తకుడుగా నెరింగిన త్రిలోకసుందరియు, నామెతొడ్రియు గూడ నాయవజ్ఞతకార్యమునకుమిగుల జింతించిరి అంత విష్ణుదత్తుండు మంత్రిని రావించి, జరిగిన ప్రమాదము నాతని కెరింగించి, యీందులకు బ్రతీకారము నేమైన జెప్పుమని కోరగా నంతడు,

"ప్రభూ! ఆతని శుభలక్షణములబట్టియు, నతడెల్ల రాజులవదువ గూర్చొనుటను బట్టియు నాబాలిక యతండును నొకభూవల్లభుండే యనుకొని వరించినది, ఇం దామె దోషమూవంతయును గానరాదు. తమరి. రాజనందన యెవని కంఠమున పూలదండ నలంకరించునో వాని కామె నిచ్చి వివాహముచేయుదుమని చాటినారు. ఇప్పుడట్లు చేయకుండుట యపఖ్యాతికి కారణంబు అదియునుంగాక నావర్తకుండు నిజమైన వర్తకుం డని నాకు దోచదు. ఆతని సులక్షితలక్షణములంబట్టి యెవడో నొకభూవల్లభుండే కారణాంతరంబుల నిట్టి వర్తకుని వేషము ధరించి యుండునని యంతఃపురంబునకు రావించి వివిధరీతిని గౌరవంచి త్రిలోకసుందరిని, వానిని నొక గదియందు వేరువేరు తల్పములం దూడ నియమించి, యామె చేతనే యతని కుల గోత్రములను, నివాస స్థలమును చేయు వృత్తియు నడిగింపుడు. ఈ విషయంబున కనంతర కార్యమూలో చింతము' అని మంత్రి సలహా ననుసరించి విష్ణుదత్తుండు మంత్రి జెప్పిన చొప్పున నా రాత్రియే వర్తకుని సగౌరవంబుగా రావించి "అయ్యా! రేపే నీ వివాహంబు జరుగనున్నది. ఈ లోపున నీభార్యను బరిచయంబు గావించుకొనుము" అనిజెప్పి వానిని శయనమందిరంబునకు బంపి,అనంతరము కుమార్తెకు జెప్పవలసిన విషయంబుల జెప్పి, యామెను గూడనా మందిరంబులోనికే బంపెను.

అంత త్రిలోకసుందరియు, వర్తక వేషధారియగు విక్రమార్కుడును చేరియొక మృదుతల్పమున కూర్చొనియుండిరి. తొలుత దానామె వర్తకునితో భాషించుటకు సిగ్గుబడి, త్రిలోకసుందరి యేమియు పలుకక మిన్నకుండ, విక్రమార్కుడును కొంతతడవు నట్లె కూర్చొనియుండి కారణంబులేక తా నెట్లామెను బలుకరింప వలయునా యని యోచించి కాలము వృధాయగుచున్నందున నేమియు దోచక, నచటి గోడకు వ్రేలాడ దీయబడిన నొక పటములోనికి భేతాళు నావహింపజేసి, ఓపటరాజమా! రాజనందనకు మాటలు రావట. నాకు కాలక్షేపంబు గాకున్నయది. నీవైన నాకేదేని యొకకథనుజెప్పి, శ్రమను బాపు'మన నాపటముమనుష్యభాషను మాటాడ, రాజనందన నిర్జీవమగు పటము మాటాడుట కచ్చెరువంది, అది యేమిజెప్పునో వినగోరి కుతూహల చిత్తయై యుండ, నాపటము విక్రమార్కునకొక చక్కని కథను జెప్పెను. ఆకథను నీకు తరువాత సోపానంబు నందుగల విగ్రహంబు చెప్పగలదు. నీ కద్దానివిన కుతూహలము గలదేని యో భోజభూపాలా! నీ నచటి కరుగుము" అని యది జెప్పినంత భోజమహీపతి విక్రమార్కునకు పటము జెప్పిన కథను గూడ విన కుతూహలుండయియుందు సోపానంబు నెక్క యచటనున్న విగ్రహంబు భోజున కిట్లు చెప్పసాగెను.

---

## —♦ 18వ ప్రతిమ చెప్పినకథ ♦—

"ఓ భోజనృపశేఖరా! నీవు కథా శ్రవణమునకుతూహలుండవై వచ్చితివిగాన, నా రేయి త్రిలోకసుందరి శయ్యాగారంబునగలపటము విక్రమార్కునకు జెప్పిన కథావిధానమును నేను నీకు జెప్పెద సావధానుండవయి యాలకింపుము' అని పదునెనిమిదవ సోపాన విగ్రహంబు పటము విక్రమార్కునకు జెప్పినట్లు తాను భోజునకీ కథను చెప్ప నారంభించెను.

" దేవా! నన్ను నిర్జీవపదార్థముగా నెంచక, యొక కథను జెప్ప మంటివి గాన, నాకు దోచిన నొక యితిహాసంబును జెప్పుచున్నా నాల కింపుము.

చంద్రశేఖరుండను భూపతి చంద్రనగరమును అతులిత వైభోగమున బరిపాలించు చుండియు, యతనికి పెక్కు భార్యలున్నను, సంతానలేమి గుందుచు, ననేక యజ్ఞయాగాది క్రతువుల నాచరించి కొంతకాలమున కు దైవాను గ్రహంబున బెద్దభార్యకు నొక పుత్రసంతానము గని పరమానంద భరితుండాయెను. ఆ రేడంత పదరొండవనాడు లేక లేక కలి గిన తన పుత్రునకు బాడితుల బలువుగ రావించి, జాతకాది కర్మలు వ్రా యించి, యసదృశ రూప శోభితుండైన యాశిశువునకు, కాంతిరూపుండ ను నామకరణము వ్రాయించెను ఆ బాలకుండును శుక్లపక్ష చంద్రుని భాతిదినదిన ప్రవర్ధమానుండగుచు గ్రమముగా సర్వవిద్యల యందును నారితేరినవాడై, క్రమముగా నవ యౌవనాభిరామమూర్తి యగుపదునా రేండ్ల వాడయ్యెను, అంత చంద్రశేఖర నృపాలుండును నవకుసుమము కుమారుండై షోడశకళాపరిపూర్ణుండగు తననందనునకు దగిన కన్నియను గొనితావలయునని ప్రయత్నించెను. కాని యొకనాను నీబాలకునికి దగిన కన్యగా నరాము నామహీపతిమంత్రి యాలోచ ననుసరించి, యొకనిపు ణుడైన చిత్రకారుని రావించి, తన పుత్రుని రూపపటము నొకదానిని వ్రాయించి, మంత్రులలో నొకని కద్దానినిచ్చి, "నీవు దేశ దేశములందు వెదకి, కాంతిరూపున కెల్లవిధముల దగిన బాలిక యొకయిందగలదేమో విచారించి. పెండ్లిసిద్ధపరచిరమ్ము" అని చెప్పెను. ఓభోజభూపతీ? తరువా తనేమిజరిగినదియు, నీకుముందున్న విగ్రము చెప్పగలదు పొమ్ము" అని యా ప్రతిమ చెప్పగా భోజుండట్లెయని ముందునకు నడువగా నందు న్న విగ్రహము వానికిట్లు చెప్పసాగెను.

---

—♦ 19వ ప్రతిమ చెప్పినకథ ♦—

"ఓభోజరాజా! రాజాజ్ఞననుసరించి, యామంత్రిశేఖరుండును సర్వదేశములను గాలించి, తన రాజకుమారున కెల్లవిధముల దగిన కన్నియగానరామి విసిగి వేసారి, చివర కిక ప్రయోజనములేదని యెంచి, నిజపట్టణాభిముఖుండై జనుచు మార్గమున గొంత యలసటను దీర్చుకొననెంచి, యొకసరోవరప్రాంతమునం గల చెట్టునీడను డేరాలు వేయించి, అందు దనపరివారంబులతో విడిసి, కార్యసాఫల్యము జేసికొని రానందుకు బ్రభుండేమనునోయని మనంబున గుందుచు గూర్చొనియుండెను. ఆప్రదేశంబున కాదినంబుననే వెనగో మరియొక మంత్రి కూడ వచ్చి డేరాలు వేయించి బసచేసెను. అంత చంద్రశేఖరుని మంత్రి యాయాతనమంత్రిని జూచి యిట్లనియె. 'అయ్యా! తమ రెవ్వరు? ఏకార్యమునకై యెందేగుచున్నారు? అని సగౌరవంబున బ్రశ్నింప నాత డిట్లనియెను.

"అయ్యా! నేను మహేంద్రపురాధిపతియగు నింద్రసేనుని ప్రధానిని. మాప్రభువునకు లేక లేక యొక యసాధారణ సౌందర్యరాశి యగు కుమార్తె కలిగినది యామె దినదినప్రవర్ధమానయై పెద్దదియై ప్రపంచమునంగల నన్నివిద్యలలోను నారితేరిన యాకన్నియ కిపుడు పసిండికి దావి యబ్బిన భాతి యౌవనాంకురమైనది. ఆమెను సృష్టించిన బ్రహ్మకు సహితము నామె సౌందర్యాది శుభలక్షణములను వర్ణించుటకు దరముగాదు. ఆమె పేరు కాంతిరూపిణి మహాప్రజ్ఞావతి యగు నారాజసుతచిత్రపటమును గొని యెల్లదేశంబుల వరునికొరకు గాలించితిని కాని యెందును నామెచ్చులమిన్నకు దగిన వరుండే లభింపలేదు. ఇక చేయునది లేక నిస్పృహజెందినవాడనై నిజరాజధాని కరుగుచు మార్గమున నిచట విశ్రాంతికోరి బసజేసితి నిదియె నావృత్తాంతము. దేవా! తమ రెవ్వరు? ఎందుండి యేపనిమీద జనుచున్నారు? అని యాయాతని మంత్రి చంద్రశేఖరు మంత్రి నడుగ నతడు తను యరుగుచున్న కార్య

ములును నొక్కరీతినే నొక్క పోలికయే యగుట కాశ్చర్యము నంది, తన యావద్వృత్తాంతంబును వానికి జెప్పి, తన వద్దనున్న రాజకుమారుని చిత్రపటము నతనికిచ్చి యతని వద్దనున్న రాజకుమారి చిత్రపటమును దాను దీసికొని దిలకించెను. అనంతర మా రెండు పటంబులను నొకదాని ప్రక్క మరొకదానినుంచి మంత్రు లిరువురును జూచిరి. ఆ రెండురూప పటంబులు నొకదానితో నొకటి సర్వవిధంబుల ననుకూలంబుగానుండి, సృష్టికర్త వారిరువుర నంతకుముందె వివాహ మొనర్చి యనంతరము సృష్టించెనా యనున ట్లుండుటనుగని యా మంత్రు లిరువురును తమకార్యంబు లట్లప్రయత్నంబుగా కొనసాగించిన విధాతను వేనోళ్ళ గొనియాడి, యా క్షణంబుననే ముహూర్తంబు నిశ్చయించి, శుభలేఖలను వ్రాయించి, యొకరి యొద్దగల చిత్రపటముల మరియొకరు గొని సంతసంబున నీ శుభవార్తను తమ ప్రభువుల కెరింగించిరి.

అనంతరంబు మంత్రులను నిర్దేశింపబడిన యా శుభ ముహూర్తమున నే చంద్రశేఖర యింద్రసేను లిరువురును వియ్యంకులయి, కాంతిరూప కాంతిరూపిణులకు యింద్రపురమున దేవేంద్ర భోగములతో వివాహ మొనర్చిరి. వివాహా నంతరంబు చంద్రసేనుడు తన కుమారునితోను, కోడలితోను, వియ్యంకుని యనుమతి నొంది నిజరాజధానికి జనుదెంచెను. నాటినుండియు నవయౌవన విలాసితులగు నా నూతన దంపతు లధికోల్లాసంబులతో క్షణంబుగను నొండొరుల నేడబాయక యిష్టభోగముల నందుచు, సంవత్సర మొక నిముషముగా కొంత కాలంబు గడిపిరి.

ఓరాజా! నాకు తెలిసిన దింతవరకె. తరువాయి వృత్తాంతమును వినగోరుదువేని, యిరువదవ ప్రతిమ నడుగుము" అని యచటి విగ్రహము చెప్పగా, భోజుడట్లు జేసెను.

———

—♦ 20వ ప్రతిమ చెప్పినకథ ♦—

అంత, నిరువదవ సోపానమునందున్న విగ్రహము భోజునకీ ప్రకారంబుగా జెప్ప నారంభించెను

అనంతర మొకనాటి రాత్రి, నాదంపతు లిరువురును నిండువెన్నెలలో, చల్లని పిల్లవాయువులు విరజమ్ము నారుబయట పూలపాన్పుపై నప్పటి వరకును వివిధరీతుల రతికేళిం దేలి, మన్మధుని తీటనడంచి, డస్సి యొడలు దెలియని సౌఖ్యంబుతో నిదురించుచుండిరి. అంత నా మనోజ్ఞమయిన యా పున్నమ రేయిని కొందరు దేవాంగనలు గగనమార్గమున యిష్టానుసారమున దిరుగుచు నిల్లొకరినొకరు గాఢాలింగనంబు జేసికొని మత్తెక్కి నిదురించు కాంతిరూప, కాంతిరూపిణులగని, మనంబున నానందముగొన్నవారై, వారినిజూడ రివ్వున క్రిందకువచ్చి, యాపుష్పశయ్యచెంత వ్రాలిరి. కాంతిరూపుని గని నంతనె వారి కన్నులు మిరుమిట్లు గొల్పెను. అట్టి నవమన్మధా కారుండు తమదేవతలలో సహితము లేకుండుటను గని వా రచ్చెరువంది, వానిని మోహించిరి. అట్టి యపురూప సుందర పురుషునితో భోగింపని తమ జన్మలు నిరర్థకములని యెంచి, నెట్లయిన వానిని తమ దేవలోకమునకు గొనిపోయి వంతులు ప్రకారము వానితో దా మందరు సంభోగింపవలయునని నిశ్చయించి, యతని భార్యకు తెలియకుండ నతనిని యా యప్సరస కన్నియలు గగనమార్గమున నెత్తుకొనిపోయి, దేవలోకంబు జొచ్చిరి.

"అయ్యా! యీ కథను నే నింతవరకు మాత్రమే యెరుంగుదును. అనంతర మేమి జరిగినదియు నాకు తెలియదు' అని గోడనున్న పట మంతటితో తన కథ ముగింప, విన్న త్రిలోకసుందరి అయ్యో! కాంతిరూపుని విధ మనంతర మేమయినదియు జెప్పక నీ పట మూరకొనుచున్నదే! మిగతా కథ నెట్లు తెలుసుకొన వలయును? అని తన మనంబున చింతించుచుండ, కపటవర్తక వేష ధారియగు విక్రమార్కుండా

పటము నుద్దేశించి, "ఓ పటరాజమా! నడుమను కథ నాపి, యూరపయి నాకు రాదనుచుంటివి. పిమ్మట నేమి జరిగినదియు దెలిసికొన వలయు. నని మిక్కిలి యుత్సాహంబుగా నున్నయది. యింక చెప్పెడివా రెవరు ఎట్లు తెలియును? యని యడుగ విక్రమార్కునకా పట మిట్లనియెను.

"అయ్యా! దీని తరువాయి కథను జెప్పువా రిచట లేకపోలేరు మిగతా కథను వినవలయునన మీాకంతగా యిచ్ఛగలదేని యూరాజ కుమారిచీరచెరగుల నడుగుము. అదియే మీకు తరువాయి కథను జెప్పగలవు. అని యూరకుండ భేతాళుండు త్రిలోకసుందరియొక్క చీరచెగుననావహించెను, పటము చెప్పిన మాటలకు రాజకుమార్తె సిగ్గుపడి, "ఓహో! ఇది కడుచిత్రముగానున్నదియే. పటములును మగువలచెరంగులును పలుకుట యెన్నడైన వింటిమా! ఈవర్తకుం డెవడో న సాధ్యునివలెనున్నాడు. కానిమ్ము యెట్లయిన మిగతా కథనువినవలయు నునని యూరకుండ నంత వర్తకరూపధారియగు విక్రమార్కుండు రాజ కుమారి చీర నుద్బోధించి, 'ఓరాజకుమారియొక్క చీర చెరుగా? నీవైనను మిగతా కథను పూర్తి చేసి నాకోర్కెను దీర్పుము అననాచీరచెర గు యీాక్రింద కథను విక్రమార్కునకు జెప్పెను. "ఓభోజభూపాలా! నీవాకథను వినగోరితివేని ఇరువదొకట వసోపాన ప్రతిమకడకు బొమ్ము అనిచెప్ప గాభోజుడావిగ్రహము కడకుబోగానది యిట్లు చెప్పనారంభించెను.

---

## —♦ 21వ ప్రతిమ చెప్పినకథ ♦—

"ఓభోజభూపాలదేవా! రాజకుమారి చీరచెంగు విక్రమార్కునకు జెప్పిన తరువాయి కథను నీకు జెప్పుచున్నాను సావధా నుండవై యాలకింపుము.

కాంతిరూపుని దమలోకమునకు గొనిపోయి, నాతనితో సురత

భోగములననుభవించుచు దనివిదీర్చుకొనుచుండిరి. కాంతిరూపుండును చేయునది లేక యటనే నాదేవకన్నియల కామముందీర్చుచు గాలము గడుపుచుండెను. అచట కాంతిరూపిణియు నామరునాటి యుదయమ్మున విభుని జాడదెలియక పరిపరివిధంబుల విచారించి, చెలులవలన వారాతని వృత్తాంతము నామె మామగారికి జెప్పి, పతివియోగంబునకు మేరలేని దుఃఖమునందుచుండెను. చంద్రసేనుండును యేకపుత్రవియోగంబును భరింపజాలక పలువురను పలుతావులు బంపించెను. ఎందును కుమారుండు గానకపోవుటం జేసి, యాతడు రాజ్యభోగంబుల విడనాడి గుందుచుండెను. కాంతిరూపిణియు విరక్తచిత్తయై సదా తనప్రాణవల్లభుని మనంబున దలంచుచు గాలంబెట్లో గడుపుచుండెను.

అనంతరము కాంతిరూపునిపోయిన దేవాంగనలందరును నొకచో జేర అందు గొందరిట్లనిరి. 'అయ్యో! మనమొక్క తప్పుకార్యము నాచరించితిమి. అగ్నిసాక్షిగ నీతనిని బరిణయమాడినమగువ వానికొరకెంతయు గుందుచుండును. అందులకు మనము చేయవలసినదేమన, ఆలలనామణిని గూడ నిచటికి దెచ్చి మనతో నొకదానిగా జేర్చి యామెకు గూడ మనతోపాటు వారమునకొకనాఁడీమోహనాంగునితో సంభోగించు వంతుని యవలెను. అట్లు చేయకున్నచో మనలకు మహాపాతము జుట్టుకొనును.

అంతట మఱికొందరు. 'అట్లుగాదు. ఆమె నిచటికి దెచ్చిన మనలో జేర్చుకొనిన యీకార్యమున కామెయును సహింపదు. మనల నెల్లని మోసపుచ్చి తనపతిని దోడ్కొనిపోగలదు. ఆమె యట్టి ప్రవీణురాలు. అందులకు మన మీమెన్మికాని నామెకడకు గొనిపోయి, యామెకు దెలివి లేకుండజేసి, యప్పుడీతడామెతో రమించునట్లు చేయుద" మనీయేర్పాటున కెల్లరును సమ్మతించిరి.

అది మొదలు వారంబున కొక్కతూరి యాదేవాంగనలు సము

ద్రిస్నానమున కరుదెంచు సమయంబున కాంతిరూపుని తమతో దీసికొని వచ్చి, యాతని భార్యవద్ద విడచి, యామెకును, నామె పరిచారకలకు దేహస్మృతిలేండ జేసి, తిరుగ దాము స్నానానంతరము దేవలోకము బోవునపుడు వానిని గూడ దమతో దీసికొని పోవుచుండెడివారు. వారు స్నానమున కరిగినప్పు లోపల కాంతిరూపిణి, కాంతునితో దేవతల మహిమవల్ల మాటాడకుండినను, ముద్దుపెట్టుట, యతిమక్కువను కౌగలించుట మొదలగు పనులతో క్రీడించుచుండెను. ఇట్లొక సంవత్సరము గడచిన యనంతరము కాంతిరూపిణి గర్భమును దాల్చెను. ఆమె తాను గర్భమును దాల్చుట కచ్చెరువంది, భీతిచే నన్యులకు జెప్పక కొంతకాలము దాచియుంచెను. కాని కొన్నాళ్ళకీవిషయము చెలులకు దెలియవారెను, పోతుటీగకయినను జొర నశక్యంబైన యారాజాంతఃపురంబునని దెట్లు జరిగినదని విభ్రాంతులై, తమకెట్టి మాటవచ్చిపోవునో యను భయంబున, వారీవృత్తాంతమును ప్రభువు కెఱింగింప నతడును మరింత యాశ్చర్యముం జెంది, నిజస్థితి యెట్లున్నను, ప్రజలు దన్ను గర్హింతురను భయంబున సూలాలయినకాంతిరూపిణిని ఘోరవిపినంబుల విడచిరా, సేవకుల కాజ్ఞాపించెను. వారును, నొక యర్ధరాత్రంబున రాజాజ్ఞప్రకారంబు కాంతిరూపిణి నిదురించు సమయమున నామెను శయ్యాసహితగా గొనిపోయి యొక ఘోరారణ్యంబున విడచి నిర్దయులై చనిరి.

"రాజా! నీకు తరువాయికథను ముందున్న బొమ్మ చెప్పును నీ వటకరుగుము." అని యావిగ్రహము చెప్పగా, భోజుండంత ఆవిగ్రహమునువీడి ముందుసోపానమునధిష్టింపగా, నచట విగ్రహమిట్లు చెప్పనారంభించెను.

---

## —♦ 22వ ప్రతిమ చెప్పినకథ ♦—

"ఓ భోజ నృప శేఖరా! అనంతరము కాంతి రూపిణి మరికొంత తడవునకు మేల్కాంచి, లోకాపవాదంబునకు వెరచి తనమామగారె తన్నిట్టికర్దశ పాలు గావించి, యుంటను నిగ్రహించి, ఇక దాను జీవించుట నిష్ప్రయోజనంబని యెంచి, యాకారడవిలో నేదేని యొక దుష్టమృగంబున కాహారముగా జని మృతినొందనెంచి, యటసంచరించు ఘోర వ్యాఘ్రాది క్రూరమృగంబుల కెదురేగ నవ్వి యామహాప తివ్రితా శిరోమణి దరికి బోవాలక భారిపోవుచుండెను. అంత నాసాధ్వీలలామ యిక చేయునదిలేక యప్పటికి జందోద్రయ మగుటచే దనకగుపించిన యొక బాటనుండా గొంత దూరమున నామె కొక వెలుగుకనుపించెను, అచట నెవ్వరేని యుందురను తలంపున గాంతి రూపిణి యావెలుగున్న దెసకు బోయి చూడ నదియొక స్మశాన వాటికయై, యందొక శవము కట్టెల గాలుచుండెను. కాని యచ్చోట నెవ్వరును గానరారయిరి. తాను ప్రాణముల విడుట కా కాష్టమొక మార్గముగా నెంచి, కాంతి రూపిణి భగవంతుని మనసులందు నాకాలుచున్న చితిపై దుముక సంసిద్ధురాలై యుండ నంతలో నొకవృద్ధురాలు గోలుగోలున నేడ్చుచు నాపీనుగు కాలుచున్న చోటునకరుదెంచెను. ఏదయ్యమోభూతమో యామాద్రరాత్రిని సంచరించును దన్నుజూచి భయపెట్టవచ్చినదని కాంతి రూపిణి తొలుత భయమందెను, అనంతరము దానెట్లయినను మరణింపను టెనిగదా! యనియు, యొకతిని మరణించినను నొక్కటియేయనియు నెంచి, యావృద్ధవనిత కెదురుగా నిలుచుండెను, అంత వృద్ధరాలును కాష్టమున నురకబోవుచున్న కాంతిరూపిణి హస్తమునుబట్టుకొని,'అమ్మా! నీవెవ్వరవు? ఈయర్ధరాత్రింబున నీకాలుచున్న కాష్టంబున బడియేల నీసుందరగాత్రమును నుసిగావింప జూచుచున్నావు? నీకాపురంబెద్ది? నీకువచ్చిన యాపదయెట్టిది?" యని యడుగ నాబాలబట్టి

యామె యావచ్చినది పిశాచముగాక మనుష్యస్త్రీయేయనియు, తనవ లెనే నేదియోకారణంబుననాకాంతారంబునకువచ్చియుండుననియు నెంచి భీతినివీడి, కాంతిరూపిణి దానెవ్వరైనదియు, తానచటికి వచ్చిన కారణంబును మొదలుగా గలసర్వ వృత్తాంతముచు ధైర్యముతో నాయును సలి దానికి జెప్పి మరియు "అవ్వా! ఇదియె నావృత్తాంతము నీవెవ్వతె వు? నావలె నీకును నెట్టియాపదవాటిల్లనిటకరుదెంచితివి" యని తన దుఃఖమును గొంత దిగ మ్రింగి యడిగెను. కాంతిరూపణి దీన చరిత్రి కాముసలిది మిగుల విచారించి, 'తల్లీ! ఎట్టికష్టముల పాలయితివమ్మా దైవసంఘటనము నెవ్వరెరుంగ జాలరుకదా! రాజకుమారితవై యెల్లభోగములన నుభవింప వలసినదానవు నీవె యిట్లు యిడుములంగుడుచు చుండ, యికమాబోటి సామాన్య మాటలయుడువల యునా? అయిన ను నడిగితివిగాన చెప్పుచుంటిని 'నేనీపట్టణముననుండు మదవతియను వేశ్యను. ఇపుడేచితిలో గట్టెలంగాలుచున్నది నాకూతురు ఈమె దప్ప నాకు వేరు సంతానములేదు. కొలది దినంబులనుండియు నీమె రోగగ్రస్తయె నేడుమరణింప, నాబంధుగులీమెనట్లు చితిపై బెట్టి జనినారు. పుత్రికా వాత్సల్యంబున దుఃఖముండబట్టక నొక్కసారి యీచితినైనను జూచి పోదలచి యేడ్చుచు నిటకరుదెంచితిని. మృతులైన వారికైయే డ్చిన వారు మరలి వత్తురా? అమ్మా! గొప్పవారి బిడ్డవైన నీవు కష్టముల పాలయితివి, నేను చెప్పునదేమన యిపుడు నా వెంటనచ్చి మాగృహంబున యుండుము. నీకే గొరతయు లేకుండ, నీవుమాయింట నుంటివను రహస్యము నెవరికిని దెలియకుండ గాపాడెదను. నిన్నేయిక నాపుత్రికగా భావించి కొంతదుఃఖమునైన దిగమ్రింగెద" అని పలికిన వృద్ధురాలి మాటలకు గాంతిరూపిణి యప్పటికి దనకంతకంటెను గత్యంతరము లేదని వృద్ధవేశ్యతో నామె గృహంబున కరుగును, అవ్వా! దేయూరు? అని ప్రశ్నింప నావృద్ధురాలు, 'అమ్మా! ఏనగరంబున నీవు

సకలయిశ్వర్యముల నందితివో యేరాజు నిన్ని విపినంబులకు బంపెనో యట్టి చంద్రశేఖర మహీపాలుం డేలు చంద్ర నగరమే యిది ఇదిరా త్రిపురాటవియె మరియు నిది మహారణ్య మగుటచే నీ కేమియు దెలియుట లేదని జెప్పి యావృద్ధ వేశ్య కాంతిరూపిణిని తన గృహమునకుగొని పోయెను.

"ఓ భోజ మహీపాలా! ముందు కథ నాకు తెలియదు. పయి విగ్రహము నడుగుము." అని యా విగ్రహము చెప్పగా భోజుడట్లు చేసెను. అంతట నా విగ్రహము భోజునకిట్లు చెప్పదొడగెను.

---

## —♦ 23వ ప్రతిమ చెప్పినకథ ♦—

"అట్లు కొన్ని దినములు గడచిన యనంతరమా వృద్ధవేశ్యకు నపురూప రూపవిలాసినియగు కాంతిరూపిణీ మూలంబున నధికధనమునార్జింప వలయుననెడి కోర్కె జనింప, యప్పటి కామె గర్భవతియైయుండుటనుగని, ప్రసవకాలమునకై యెదురుజూచు చుండెను. ఈలోపున నా వృద్ధురాలు మంత్రసానిని బిలచి, కాంతిరూపిణికి యాడు శిసువు జన్మించిన సంతోషమే యనియు, మగశిశువు జన్మించినచో తల్లికి తెలియకుండ వధించి, యా తావున నొక కర్రబొమ్మ నుంచి యదియే కాంతిరూపిణికి జన్మించిన సంతాన మని చాటునట్లు జెప్పెను. అంతట నొక సుభముహూర్తంబున గాంతిమణికి సర్వాంగ సుందరుండగు నొక మగశిశువు జన్మింప, సాని చెప్పిన తెరంగున నామంత్రసాని కాంతిరూపిణి కండ్లకు గంతలుకట్టి యాశిశువు నపహరించి, యచ్చోటనొక కర్రబొమ్మనుంచి, యదియే జన్మించినదని కాంతిరూపిణి జెప్పెను. తనకు గలిగిన నన్నిదురదృష్టములకు వలెనే నదియు నొక దురదృష్టము కాబోలునని కాంతిరూపిణి చింతించి మనమున పలువిధముల కుందెను.

అనంతరంబు మంత్రసాని యా శిశువును దోడ్కొనిపోయి, పురబాహ్య ప్రదేశమునగల యొక యరణ్యంబు ప్రవేశించి, యా తేజోరాసిని గడతేర్చుటకు చేతులురాక, వాని నచట నొక పుట్టయందునవిడచి చనియెను. అయ్యో! నేనా కథ నంతవరకె యెరుంగుదును. తరువాయి కథను వినగోరెదవేని యీ రాజ కుమార్తె యొక్క సిగలోని పూవుల నడుగుము' అని తా నెరింగిన నంతవరకె యని యూరకుండెను. అంతట రాజకుమారి యెన్నడు నెరుగని చీర మాట్లాడు చుండుటకు గారణంబువర్తకుడే యని నెంచి, యతడొక వర్తకమాత్రుండే గాక, మహా గుణసంపన్నుం డెవడో యని యెరింగి తన సిగపూవు చెప్పబోవు తరువాయి కథనుగూడ విననలయునని, కుతూహల చిత్తయైయుండెను.

‘ఓ భోజరాజా! తరువాయి కథను ముందున్న సోపాన విగ్రహము నడుగుము. అది నీకు చెప్పగలదు' అని ఆ విగ్రహము చెప్పగా, భోజుడు ముందున్న విగ్రహము కడకు పోగా, నది యిట్లు చెప్ప నారంభించెను.

---

## —◆ 24వ ప్రతిమ చెప్పినకథ ◆—

విక్రమార్కుండు రాజకుమారి సిగలో నడగియున్న పూవునుద్దేశించి, ఓ రాజకుమారి సిగలోని పూవా? మిగతా కథను నీవు పూర్తిగావించి మదీయ యీప్సితంబును నెరవేర్పుము” అన త్రిలోకసుందరి సిగలోని పువ్వు యీ క్రింది తరువాయి కథను జెప్ప మొదలిడెను.

‘మంత్రసాని యాబిడ్డ నట్లు పుట్టచెంత బారవైచి పోయిన గొంతసేపటికొక మహాసర్పమొకటి యా పుట్టలోనుండి యరుదెంచి, తనవిశాలమైన పడగను విప్పి, యాశిశువు శిరముపట్టి యతనికెండ తాకకుండ గాపాడుచుండెను. ఆ పుట్టకు దరినే యున్న దేవాలయములోని నాగదేవుని దివ్యశక్తివలన నాబాలకున కాకలిదప్పులు లేకుండెను. అంత

నారాత్రి యానాగసర్పంబు చంద్రశేఖరునకు స్వప్నంబున గనుపించి తన దేవాలయంబుచెంత నొక మహారూపవంతుడగు నొకమగశిశువు పడియుండెననియు, వాని నతడు దెచ్చి పెంచుకొన్న యెడల గొప్ప శుభంబులు చేకూరగలవనియు, జెప్పి యంతర్ధానమయ్యెను. అమరునాడుచంద్రశేఖర నృపతియు పరమానందమున నాగుసర్పము జెప్పిన చొప్పున నా దేవాలయ ప్రదేశమున కరిగి, యాశిశువుగని యాశ్చర్య చకితుడై, వానిగొని తెచ్చి, తన భార్యకిచ్చి నతిగారమున బెంచుకొనుచుండెను. చంద్రసేఖరుడా బాలునకు విక్రమసేనుండను నామమిడి వాని నన్నివిద్యలయందును బ్రవీణుం జేసెను. ఆ బాలకుండె తన యనంతరము రాజ్యపాల నార్హుండని యెంచి యతడాతనిం గని యానంద పరవశుడగుచుండెను. క్రమంబుగా విక్రమసేను డిరువది వత్సరంబుల నవయౌవనుండయి యెల్ల ప్రజలకును గన్నుల పండువ నొనర్చుచు, సర్వజనుల పొగడ్తల నందుచుండెను.

అంత విక్రమసేనుం డొకనాడు పురము నంతయు జూడగోరి తన మిత్రులతో నరదంబు నెక్కి రాజవీధులలో జనుచుండ, మేడలపయినుండియు, మిద్దెలపయి నుండియు స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు వారు వీరనక యెల్లరును పురవీధుల జను విక్రమసేనుని నుత్సాహమున నేత్రానందముగా జూచుచుండిరి. అతడు కొన్ని వీధుల దిరిగిన యనంతరంబు వేశ్య వాకిటగుండా జనుచుండ, నెల్లరతో బాటు కాంతిరూపిణియు, వృద్ధవేశ్యయు గూడ తమ వాకిట నిలచి విక్రమసేనుండు తమ పరివారముతో జనుచుండ జూచుచుండిరి. సర్వాంగసుందర నవమోహనాంగియు, నసమానలావణ్య విలాసినియు నగు యాలలనామణిగాంచినంతనే విక్రమసేనుం డామె యందు మోహము గొన్నవాడయి, యామె యొక వేశ్యగా నెరింగి, వెంటనే తన సేవకుని ద్వారా నాటి రేయి తా నామె యింట గడప నిశ్చయించు కొన్నట్లును, నామె కోరిన ధన

ము నిచ్చునట్లును వర్తమానము నంప, నాపరిచారకుండును వృద్ధ వేశ్య యాగు మదనతిని గలుసుకొని రాజకుమారుని సందేశము నెరిగింప, దా వృద్ధ పరమానందమున నందుల కంగీకరించి, యారాత్రి విక్రమ సేనునకా సేవకునిచే నాహ్వానము నంపెను. "అంతవరకును కథచెప్పిన యావిగ్రహము భోజరాజును మునుసోపానము నెక్కుమన నతడట్లు చేసెను.

---

—♦ 25వ ప్రతిమ చెప్పినకథ

అంతటఆసోపానము నందున్న విగ్రహము భోజున కిట్లు చెప్ప నారంభించెను.

"ఆనాటి సూర్యాస్తమయసమయంబున విక్రమసేనుండు మజ్జన భోజనాదికృత్యముల నెరవేర్చుకొని వలయుధనమును వెంటగొని, సర్వా లంకారభూషితుండై తానానాడు గనిన మోహనాంగియగు వేశ్యను బొందగోరి చనియెను. ఆవేశ్యయింటిముంగటి నొక గోవు తనవత్సతో బరుండు తొందరపాటున జనుచున్న విక్రమసేనుండా గోవుతోకను ద్రొక్కెను. అంతనది విక్రమసేనుని పదఘట్టనమునకు మిగుల బాధజెంది నదైతన లేగతో నిట్లు చెప్పుకొనెను.

"వత్సా! చూచితివా! నరుల పొగరుబోతుతనము! నిజమాతను గలియపోవుచున్న నీకామాంధునకు నన్ను ద్రొక్కకూడదను యింగిత జ్ఞానమెట్లుండును? అబ్బా! ఎంతబాధను గలిగించినాడు! కానిమ్ము అతడు తనపాపంబును దానే యనుభవించును.

జంతుభాషను నేర్చియుండిన విక్రమసేనుండాగోవు పలికిన పలు కులకు మిగుల నచ్చెరు వంది, ఏమీ నేను నాతల్లిని గలియ జను చుంటినా? నేనుక్రీడింపబోవునది వేశ్యకాదా! ఇందేదియో బరమరహ స్యముండి తీరవలయును. గో వాక్యములు పొల్లుగానేరవు. కానిమ్ము

కేవలమగా మాకొరకునై మెలంగి యిందలి రహస్యమును దెలిసికొందును గాక! యని వేశ్యగృహంబులోనికి జనియెను. అంత మదవతి వానికి దగిన మర్యాది నొనర్చి, నాతని కోరకమర్చియున్న ప్రత్యేకశయ్యా గృహంబునకు వాని జేర్చి, యనంతరము కాంతిరూపిణి కడకువచ్చి, నేటితో మనదరిద్రము తీరిపోయినది. విక్రమసేనుండు నీపొందును గోరి వచ్చియున్నాడు. అత డతికధనశాలి నివతిత్వరితంబున నలంకరించుకొని శయ్యాగారమునకు జని, తగు విధమున జరించి, వానిని సంతోషపెట్టుము, అని పలికిన వృద్ధ వేశ్య పలుకులు కాంతిరూపిణి చెవులకు ములు కులవలెనాట, నామె వృద్ధరాలితో.

"అమ్మా! ఇదేటి దుర్బుద్ధి నేను కులాంగనను గాని కులటను గాను నీవింతకొరకా నన్నిన్నినాళ్లును బోషించితివి? ఈసంగతిని నాకు దొలుతనే జెప్పియుండిననే నిచటికి రాక నాకర్మమున నేను బోయియుం దు దానను కదా. ఆశ్రయమిచ్చి యాదరించుదనిన వచ్చితిని. గాని యిట్టి పశుప్రవృత్తికి బోత్సహించుచుదనిన వత్తునా? నాప్రాణమునన్నైన విడుతును గాని శీలమును మాత్రము విడజాలను. నాయందు దయ యుంచి, నీచెడు తలంపుల నిక మానుము. అనియెను. అంత నావృద్ధ వేశ్య కన్నులెర్రజేసి, "అమ్మో! ఎంత ఘోరము! ఓసీ పాపాత్మురాలా! నాకొంపకు దీముపలంచితివా? నాకు రానున్న ధనమును పాడుజేసెదవా? నీవు నా యిష్టప్రకారంబు నడచుకొనుచు నన్నుగూర్చుకొని నింత వరకు నీసంగతిని నీకు జెప్పలేదు. ఇపుడు రాజకుమారుని యాహ్వానించి, తిరస్కరించిన మంతలలు పోవు? ఇక మాట్లాడక వెంటనే జనుమని నిర్బంధింపు కాంతిరూపిణి తన నిస్సహాయతను దలపోసి విలపించుచు వృద్ధురాలి మాటలవినసందున నా వేశ్య తన పరిచారికలచే గాంతి రూపిణిని రాజకుమారునుండు శయ్యాగారంబున బలిమిత్రో త్రోయించి, తలుపులు బిగియించెను.

"ఓభోజభూపాలా! సిగపూవు చెప్పిన కథను నేనింతవరకే వింటిని గాన తరువాయి కథ నాకు తెలియదు. దానిని గూడ వినగోరుచుంటి వేని ఇరువదారవ సోపాన విగ్రహము నీకాకథను చెప్పగలదు పొమ్ము. అని ఆసోపాన విగ్రహము తనకథను అసాంతముగా వినిపింప భోజుండు తరువాయిని వినగోరి ముందు సోపానము నెక్క అందలి విగ్రహము భోజునకు తరువాయి కథ నిట్లు చెప్పెను.

---

—♦ 26వ ప్రతిమచెప్పినకథ ♦—

"ఓభోజరాజా! రాజకుమారి సిగపూవు వర్తకవేషధారియైన విక్రమార్కున కాకథను తిరుగ నిట్లు చెప్పదొడంగెను.

అంత గాంతిరూపిణి మహాదుఃఖంబున దనపాతివ్రత్యము గాపాడుమని భగవంతుని మనంబున బ్రార్థించి, యవతిశయ్యపై గూర్చున్న రాజకుమారుని గన్నెత్తి చూడనాతనియం దామెకు బుత్రవాత్సల్యము జనించెను. అపుడామె స్తనంబులనుండి చిమ్మని గోత్రినుండి చిమ్మిన తెరంగుపాలు చిమ్మి విక్రమసేనుని దేహంబును ముఖమును దడిపివైచెను కామోద్రేకమున వచ్చియున్న నా రాజకుమారున కాయువతి యందు మాతృభావముదయింపనాతడాసాధ్వికి నమస్కరించి వెంటనే యాతావును వీడిపోయె గోమాత చెప్పిన వాక్యములను తనకు జరిగిన కార్యమును నొకటిగా యగుటకు మనంబున నచ్చెరువంది యాకారణంబును తాదెలిసికొనవలయునని నిశ్చయించెను కాని దాని కారణము నరయలేక యానాడు చింతాక్రాంతుడై యెవరితోను మాటాడక శయనింప చంద్రశేఖరుండు వాని పరిస్థితికి మనంబున దిగులంది వాని కడకేగి కుమారా! నేడేలకో నీవు వికలచిత్తుండవైయున్నట్లు దోచుచున్నది అందులకు గారణమేమియో జెప్పిన వెంటనే తన్నివారణోపాయంబు నాలోచించెద నన విక్రమసేనుండంత మహాప్రభో యిన్నినాళ్ళనుండి

యు తమరు నన్ను బెంచి పెద్దవానినిగ జేసితిరి. దానంజేసి మీరే తల్లిదండ్రులని యింత వరకును భావించితిని. కాని, నే నొక్క కారణమున నాజీవితంబునుగురించి నాకనుమానముతట్టినది. తమరునాజన్మవృత్తాంతంబును నాకెరిగించి నాసంశయంబును బాపవేడెదనని చంద్రశేఖరుడు వానితో నాతడు తనకు నాగసర్పంబు కలలోగనుపించిన విషయమును తన నిజసుతు డెటకో వెడలిపోయిన సంగతియు నంత తన యిల్లాలు గర్భవతికాగా నామెను యరణ్యంబుల విడచిన తన పూర్వవృత్తాంతంబును వాని కెరిగించి యతడు తనకు నా గుడివద్ద నొక పుట్టచెంత దొరకిన కథ నంతయు జెప్పి యంతకంటె తన కితరమేమియు తెలియదని చెప్పెను.

అంత విక్రమ సింహుడు "అమాత్యా! మన గ్రామమున మదనవతి యను వేశ్య యింట నున్న త్రిలోక సుందరి యను యువతీలలామ నడిగిన నాజీవిత రహస్యము తెలియగలదని నాకు దోచుచున్నది. తమరామెను రావించి యడుగుడు" అనుటయు వెంటనే రాజు తన పరిచారకుల బంపి, మదనవతిని, నామె యింటనున్న మరియొక సుందరాంగిని రావింప మదనవతి గడగడ వడకుచు ప్రభువునకు నమస్కరించి నిలుచుండెను. అంత చంద్రశేఖరుడా వేశ్య నిట్లు ప్రశ్నించెను.

"ఓసీ! నీతోనున్న యీ సుందరి యెవ్వరు? ఈమె నీ కుమార్తెయేనా? లేక యాశ్రితురాలా? ఈమె చరిత్ర మున్న దున్నట్లు తెలుపుము. లేకున్న దండింతు"నన నా వృద్ధురాలు భయకంపిత గాత్రయై రాజు తనకు సర్వము దెలిసి యుండియే నన్నిట్లు ప్రశ్నించుచున్నాడనుకొని, తన కుమార్తె మరణించుటయు, తాను చితకడ కరుగుటయు, నచట నీసుందరి కాష్ఠముపై పడబోవుచుండ దాను తనయింటికి దీసుకొని వచ్చుటయు నామెకు మగశిశువు జన్మించుటయు, దానాశిశువును మంత్రసాని చే చంపించినసంగతి, మొదలగు సకల విషయములను

కుమారునివలనే నీసుందరాంగికి జాలుకలిగినది. ఈమెయందు దావంతయు దోషములేదు. ఉత్తమయిల్లాలన నీమె నేజెప్పుదు. విక్రమసేనుడు కాంతి రూపిణికి నిజతనయుండు నీకు మనుమడు. ఇపుడు సాధ్వీరత్నమైన నీ కాంతిరూపిణి భక్తితో నా దేవాంగనల బ్రార్థించినచో దనపతిని దాను బడయగలదు అని చెప్పినాగుం డంతర్ధానం బయ్యెను.

"ఓ భోజరాజా! తరువాయి వృత్తాంతము నాకు తెలియదు. ఇరువదేడవ ప్రతిమ యనుపేరు మనియైన విగ్రహము చెప్పగా భోజుడట్లుగా వించెను. అంతటనా విగ్రహము నాసకిట్లు చెప్పుచున్నది.

---

## —♦ 27వ ప్రతిమ చెప్పినకథ ♦—

"భోజా! అట్లుకాంతి రూపిణి తనతల్లియని యెరింగి సంతస విక్రమసేనుండామ పాదంబులకు నమస్కరించి, యజ్ఞాన జనితంబులైనదన నేరంబులన్నిటిని మన్నింపుమని జననిని వేడెను. అంత గాంతి రూపిణియు కుమారుని వాత్సల్యంబున జూచి, యనంతరంబు నాగు దేవ్యుండానతిచ్చిన చొప్పున నతిభక్తితో ఏన కొరకు దేవాంగనల బ్రార్థింప వారామె భక్తికిమెచ్చి ప్రత్యక్షులై యామె నాముకేర్పి వారి నాశీర్వదించి జనిరి. అంత గాంతిరూపుండు భార్యను గౌగలించి తన్ను దేవాంగనలు గొనిపోయినది మొదలు నాటివరకు జరిగిన వృత్తాంతము నొండొరులు చెప్పుకొని విచారమును మరచిరి అంతకాంతి రూపుండు పుత్రుని గౌగలించి తండ్రికి నమస్కరించి తన యావద్వృత్తాంతమును వారికెరింగించి యానందమును నుండెను. అనంతర మొక్క సుభము హూర్తంబున కాంతిరూపునకు రాజుపట్టాంబు గట్టి గన్నులపండువుగ నానందించి మరికొంత కాలమునకు తపో వనముల కరిగెను. అనంతరము కాంతి రూపుండు చాల కాలము భార్యా సుతులతో గూడి రాజ్యపాలన మొనర్చెను. ఓ విక్రమార్క మహీవల్లభా! కథ పూర్తియైనది. భూపాలుండవగు నీ

కూటలు దో్రిసిపుచ్చలేక దోచిన రీతిని కథ చెప్పితి. తప్పు లున్న యెడల మన్నింపుము' అని యా పుష్పము తన కథను ముగించినది.

అంతట రాజకుమారి యీ వర్తక వేషధారి విక్రమార్క మహీవల్లభుండని యెరింగి, యాశ్చర్యానందంబుల నాతని పాదంబులకు నమస్కరించి, 'ఓ రాజకుల చంద్రమా! మాయ వేషమున నున్న నిన్ను లగుర్తింపజాలక యెన్నియో యపరాధంబులు నొనర్చినాను. వాటినన్నిటిని మన్నించి నన్ను చేపట్ట గోరుచున్నాను' అని సవినయముగా బలుక విక్రమార్కుడు త్రిలోకసుందరింగాంచి, యానందంబున "తరుణీ నీవు నీవియోనరించిన తప్పిదమెద్దియును లేదు. నీవివేకమును చిత్తవృత్తిని దెలిసికొన వలయునని యట్టి మాయవేషమున వచ్చితిని. అని తాను తన పురము విడచినది మొదలు నాటివరకును జరిగిన సంగతింతయు నామెకెరిగించెను. వెంటనే త్రిలోకసుందరి యావత్తు సంగతియును తండ్రికెరింగింప నాతడమితానందంబున నామరునాడే తన సుతను విక్రమార్కునకిచ్చి మహావైభవమున వివాహ మొనరించెను. విక్రమార్కుడచట నొకవారము రోజులుండి, యింతవరకును బ్రాహ్మణ సుతుని సంరక్షించుచుండిన సత్రాధికారిని రావించి, వానికి తగురీతి సత్కరించియా బ్రాహ్మణ బాలకునితోడను, భార్యయగు త్రిలోకసుందరితోడను మామగారి యనుజ్ఞనంది నిజ రాజధానియగు నుజ్జయిని పురము చేరుకొనియెను. ఆ విక్రమార్కుండు భట్టి మొదలయిన పరివారముతో దానిల్లు విడిచినది మొదలు నాటివరకును జరిగిన యావత్తు సంగతియును నెరింగించి, పుత్రుని సముద్రంబున గోల్పోయిన విప్రుని రావించి, తనతో దోడ్కొనివచ్చిన బాలకుని తండ్రికి నప్పగింప, నా విప్రుండు పరమానందంబున విక్రమారుని సాహసంబును గొనియాడి నిజసుతునితో యరిగెను. విక్రమార్కుండు తిరుగ భట్టితోగూడి సంసారసుఖము ననుభవించుచుండెను.

ఓ భోజభూపాలా! వింటివా? విక్రమార్కుని సాహసవితరణాది గుణములు. అట్టి లక్షణంబులలో కొన్నియయినను నీ కడ నుండినచో యతని సింహాసనంబు నధిష్ఠింపుము. లేనిచో వెంటనే వెనుకకు మరలి పొమ్ము.

అని యా సోపాన విగ్రహంబు జెప్ప విక్రమార్కుండు యద్దాని పలుకులకు యెదురాడ జాలక యాక్షణంబె వెనుకకు మరలి, నిజసౌధమునకు చనెను.

---

## —♦ 28వ ప్రతిమ చెప్పినకథ ♦—

మరియొక శుభముహూర్తమున భోజరాజు సింహాసనము నధిష్ఠింప కుతూహలంబున నలవాటైనరీతి నరుగుదేర, యిరువదెనిమిదవ సోపానమునందున్న ప్రతిమ వానిని వారించి, "ఓ భోజరాజా! విక్రమార్కునియొన్నగు సాహసవితరణాది గుణములు నీకడ లేవు. గాన నీవి సింహాసనంబు నధిష్ఠింప నర్హుడవు కావు. వలయునేని ఆ మహానీయుడు రాజ్యమేలిన కాలంబులో నాతడొనర్చిన సాహస వృత్తాంతము నొక్కదానిని నీకెరింగించెద నాలకింపుము" అని భోజరాజు వృత్తాంతమును చెప్పుమని యా ప్రతిమను కోర, నది యిట్లు చెప్పసాగెను.

"విక్రమార్కుని పురోహితుని కుమారుడగు కమలాకరుండనువాడు విద్యయందాసక్తి లేనివాడై సోమరితనంబుగా దిరుగుచుండ బంధువులెల్లరును వానిని గర్హించుచుండిరి. తండ్రి వాటిని సహింపలేక యొక్కనాడు భార్యతో 'తన్వీ! మనవాని సోమరితనము మనకు గూడ నప్రతిష్ఠ దెచ్చుచున్నది. క్షత్రియులకు విజయంబును, భూసురులకు విద్యయు, వర్తకులకు శాంతంబును, స్త్రీలకు సిగ్గును సహజాలంకారములు. విద్యాగంధము లేని మన కుమారుడున్నను లేకున్నను నొకటియే యని చింతించి పుత్రుని బిలిచి, విద్య నభ్యసించువరకును గుమ్మముతో

క్కవలదని శతివంబుగ జెప్పి నిజసుతుని కట్టుగుడ్డలతో వెడల నంపెను. అంత నాబ్రాహ్మణ పుత్రుండును దేశదేశంబులు తిరిగి యొకపల్లెగ్రామము జేరి యట నొక విప్రుని యింట జేరి, ఆ యింటి యజమాని చెప్పు కార్యంబులనెల్ల జేయుచు వారు పెట్టినదానిని గుడుచుచు కాలంబుగడు పుచుండెను. ఇట్లు కొన్ని సంవత్సరంబులు గడచిన యనంతరమా విప్రుడు కమలాకరుని యెడల దయగలవాడై, తాను మహాశక్తి సంపన్నుడు గాన కమలాకరుని నాలుకపై కొన్ని బీజాక్షరంబులు వ్రాసెను. అంత నతడు మహాపండితుడై తలిదండ్రుల జూడవలయునను కోరికతో నుజ్జయినీపురమునకు పయనంబై మార్గమధ్యంబునగల పుణ్యక్షేత్రంబులనెల్ల తిలకించుచు, కాంచీపురము జేరెను. అచట యేకామ్రనాథస్వామిని సేవించి జనుచుండ నా గ్రామంబున నతడొక వేశ్యకాంతను దారసిల్లెను. అతడామె సౌందర్యాతిశయములగని మోహించి, యాసమీపంబునున్న మరియొక కామెను స్త్రీజూపె యామె సంగతంతయు జెప్పుమని యడుగగా నామె కమలాకరున కిట్లనియెను. "అయ్యా! యామె యీగ్రామంబునగల యొక వేశ్యకాంత. నృత్యగీత సాహిత్యాది సర్వవిద్యలయందును నారితేరిన చేయి. సరసులనందర నానందాబ్ధి నోలలాడింప గల సమర్థురాలు. కాని యేమిలాభము ఈమె సౌందర్యంబును మెచ్చి యీమె పొందుగోరి యిప్పటివరకరిగినవా రెవరును బ్రతికి మరల రాలేరు. అందులకు కారణ మేమందువేని, యీమె రజస్వల యయిన నాటనుండియు నొక రక్కసుండీమె నావహించి, యీమె పొందుగోరియరిగిన వారి నందరను హతుల జేయుచున్నాడు. ఆబ్రహ్మ రాక్షసుని మూలముననీమె యౌవన మంతయు నిష్ఫలమగుచు గాంచిన వెన్నెల యగుచున్నది." అని యా స్త్రీపలికిన వేశ్య వృత్తాంతంబును వినిన కమలాకరుడు భీతిల్లి యా వేశ్యను గవయు కోర్కెను వీడి తిరుగ తన ప్రయాణంబు సాగించి కొన్నాళ్ళకు యుజ్జయినీపురము జేరి తలిదండ్రుల గలసుకొనెను.

"ఓ భోజరాజా! మిగిలిన కథను నీకు ముందున్న విగ్రహము చె ప్పగలదు. నీ వటకు బొమ్ము" అని యా ప్రతిమ చెప్పగా భోజు డట్లు చేయ, ఆ విగ్రహ మ్మును తిరుగ భోజునకిట్లు చెప్పసాగెను.

---

## —♦ 29వ ప్రతిమ చెప్పినకథ ♦—

"ఓభోజరాజా! మహాపండితుడై అరుదెంచినవానిని తలి దండ్రు లు గౌరవించి, యతనిని విక్రమార్కునియొద్దకు గొనిపోయి, బరీక్షింపు మనిరి. అంత విక్రమార్కుండు కమలాకరుని బరీక్షించి. వానికి తగిన బహుమతుల నొసంగిన సుసంతోషరంబు 'వత్సా' నీవు విద్యార్థివై యేయే దేశముల జూచినావు? ఏయే పుణ్యస్థలముల గ్రుంకితివి? అందుగల విచిత్ర ము లేమయిన నున్న జెప్పు'మన కమలాకరుండు తన యాత్ర వృత్తాంత మంతయు జెప్పి యనంతర మిట్లని మెను. 'ప్రభూ! కాంచీ పురమున నొక వేశ్య గలదు. ఆమె సౌందర్యంబునకు దేవాంగనలు సహితము సరి రారు. ఆ సుందరాంగిని గవయగోరి చనిన పురుషులెల్లరుహతులగుచుం డిరట. ఆమె పుష్పవతియగుచు నాటినుండియు నొక బ్రహ్మరాక్షసుం డామె నావహించి, యామెను పొందగోరి వచ్చిన పురుషుల నెవరినో మ్రింగివైచెనట. ఇదియే నేను గనిన చిత్రములలో కెల్ల విచిత్రమయి నది.' అని కమలాకరుండు జెప్ప విక్రమార్కుం డచ్చెరువంది యావేశ్య ను జూడగోరి కమలాకర సహితుండై యు కాంచీపురంబు బోయెను. అచ ట విక్రమార్కుండా వేశ్య యింటికి జని, యామెను గలసుకొని, "ఓ మగువా! మేము బహు ప్రయాసలకోర్చి నీపొందు గోరి వచ్చితిమి. ఏ మందువు' అన నా వేశ్య యిట్లని కిట్లనెను.

'అయ్యా! అందులకు నా కెట్టి యభ్యంతరంబును లేదు. కాని యొక బ్రహ్మరాక్షసుండు రాత్రులం దరుదెంచి, నాతల్పంబునం దెవడై న పురుషుడు యున్న యెడల వాని నతడు మ్రింగివయిచును. ఇట్లు నే

యుదారగుణ పురుషుల వానిపొట్ట బెట్టితి. నీమాట యేలినవారి చిత్తము. ఆ మాటలకు విక్రమార్కు డిట్లనియెను.

"నాకా బ్రహ్మరాక్షసుని భయ మెంత మాత్రంబును లేదు. అతడు వచ్చిన రానిమ్ము. నేనతనిని తగుమార్గంబు దండింపగలను" అన వేశ్య విక్రమార్కునితో నా రేయి గడపుటకు నిశ్చయించి, యందులకు తగిన యేర్పాటు లన్నింటిని జేసెను. ఆ రాత్రి విక్రమార్కుండు కమలాకర సహితుండయి యావేశ్య చేయు యుపచారంబుల నన్నిటిని బొందుచుండు సమయమున నొక బ్రహ్మరాక్షసుం డరుదెంచి, విక్రమార్కుని గుండెలపై గూర్చుండ కమలాకరుండు వెరగంది పారిపోయెను. అంత విక్రమార్కుండు తనవద్దనున్న చంద్రాయుధంబుదీసి, యాబ్రహ్మరాక్షసు నొక్క వ్రేటున తెగటార్చెను. అంత నా వేశ్యావధూటియు తనకు రాక్షసపీడను, వదలించిన విక్రమార్కుని పలువిధములకొనియాడి, యిక ముందునుంచియు తానాతని నాశ్రయింతు ననియు, తన్ను జేపట్టవలసినది యని కోరగా, విక్రమార్కు డామె కిట్లనియెను. యువతీ! నీరాక్షసపీడ వదలుటకు కమలాకరుండు కారణముగాని నేనుగాను. అతడే నీవృత్తాంతము నంతయు జెప్పి, నన్నిచటికి గొనివచ్చినాడు. అతనికి నీయందధికమగు మక్కువ యుండుటజేసియే నన్ను ప్రోత్సహించి నీకడకు దెచ్చినాడు నేను వచ్చినందులకు నీరాక్షసపీడ వదల్చితిని. గాన నీ విప్రుడు నీయందధికంబుగా వ్యామోహంబు కలిగియున్న యా కమలాకరుని చెట్టబట్టి సుఖింపుము. అతడు సర్వవిద్యా పారంగతుడు. సుందరాంగుడయిన యువకుడు" అన నా వేశ్యయు వానిమాటలకు సమ్మతింప, విక్రమార్కుడంత కమలాకరుని తోడ్కొని, నా వేశ్యతోడను యుజ్జయినీపురంబుచేరి అట వారికొక దివ్య భవనంబు నిర్మించి యుంచి సుఖంబుగ నుండుమనియెను.

'ఓభోజ భూపతీ! వింటివా? విక్రమార్కుని దయా గుణములు.

ఇకనయినను వెనుకకు మరలుము" అని యా విగ్రహము చెప్పగా, భోజుడప్పటికి తన ప్రయత్నమును వీడి చనియెను.

---

—♦ 30వ విగ్రహము చెప్పిన కుమ్మరవాని చరిత్ర ♦—

భోజ మహీపతీ! మరియొక శుభ ముహూర్తంబున విక్రమార్కుని సింహాసనంబు నధిష్ఠింప గోరిక గలవాడయి, ముప్పదవ సోపానకడ కరుదెంచ, నచట నున్న విగ్రహంబు భోజునిగని యిట్లనెను

'ఓ భోజరాజా! నీవు సింహాసనంబు నధిష్ఠింప ప్రతిదినమును వచ్చి యిందలి విగ్రహంబులు చెప్పు విక్రమార్కుని గుణాతిశయముల విని పోవుట జరుగుచున్నది. నే చెప్పబోవు కథనుగూడ వినుము. నీవదృష్టవంతుడ వయిన నీకు కార్య ప్రసన్నమగును. ఆ దేవి యనుగ్రహమున కొలదికాలములో నీవు సింహాసనంబు నధిష్ఠింపగలవు' అని యా విగ్రహంబు భోజునకిట్లు చెప్పసాగెను.

"విక్రమార్క మహీపాలుండీ సింహాసనంబున గూర్చుండి, రెండువేల వత్సరంబులకు నారు మాసంబులు తక్కువగా రాజ్యపాలనము జేయుచున్న కాలంబులో, గంగానదీ తీరమున కీవల నుండు నొకయగ్రహారమున కృష్ణశాస్త్రి యను విప్రుండొకడు, పుణ్యశీలుండును, వేదవేదాంగ పారంగతుండునై యుండి, తన భార్య పుష్పవతియయిన దినము మొదలుకొని, మూడవ నాటి యిరువదితొమ్మిదవ దినములును సర్వతీర్థయాత్రలను సేవించి, యా ముప్పదవ నాడామెను గూడి భోగించిన ఎడల నాదిన ప్రభావముచే నామెయొక్క గర్భంబున నొక మహాపరాక్రమవంతుడును, సర్వభూపాల నాయకుడగు కుమారుడుదయించునని యెరింగిన వాడగుటచే, నావిప్రుడట్లు, తనభార్య పుష్పవతికాగానె తాను తీర్థయాత్రలకరిగి మూడునందల యిరువదితొమ్మిదవనాటికి గంగాతీరమును చేరుకొనియెను. ఆ మరునాడె ముప్పదవ దిన మగుటచే నా వి

పుళిందా రాత్రియే గంగానదిని దాటి, తన యగ్రహారంబు జేరి భార్య
ను గూడవలయును. లేకున్న వానిశ్రమ యంతయు వ్యర్థమగును. కాని
వాని కష్టము గంగానదిందాటు నుపాయ మెద్దియు గానరాలేదు.ఆరోజు
గడచిపోవ, మూడవ దినంబగు నా మరునాడు గూడ దానా తీరము
నే యుండవలసి వచ్చినందులకును, తనశ్రమ యంతయు నిరర్థక మయినం
దులకును విచారించుచు నా గంగాతీరంబున గూర్చొనియుండెను.అంత
నాప్రాంతంబున గల కుమ్మరివాఁడొక విప్రుని చెంత కరుదెంచి, యాతని
సంగతంతయు విన్నవాడయి వాని కిట్లనెను

"ఓ విప్రోత్తమా! మీరు నిర్ణయించుకొనిన లగ్నము నేఁడేయు
న్నది. ఇపుడు మీరు మీసతి నెట్లును గూడలేరు కదా! మీ రిన్ని నాళ్ళ
నుండియు పడిన శ్రమ నేల వృథపుచ్చెదరు. నా కుమార్తె మొన్ననే
రజస్వలయి స్నాన మొనరించినది. ఆమె సర్వాంగ సుందరి. ఆమె కిం
కను వివాహంబు కాలేదు. నేను మీ కామెను సమర్పించెదను ఈశుభ
లగ్నంబున వమ్ము చేయక మీ రామెను గూడి సురతభోగంబునందుడు
ఆ కుమ్మరివాని మాటల కదియు కొంత మేలేయని యోచి, యావిప్రు
డానాడు కుమ్మరి చిన్నదానిని కూడి సంభోగించి, యా మరునాడు కు
మ్మరిదాని యొక్కయు, నామె తండ్రియొక్కయు ననుమతి వడసి,
చనియెను.

కొన్నాళ్ళకా కుమ్మరి చిన్నది గర్భవతియై, నవమాసంబులు మో
సిన యనంతర మొక చంద్రబింబ సదృశుండగు కుమార రత్నంబును
గనియెను. మహా తేజోమూర్తియయిన యా బాలకు నా కుమ్మరిచి
న్నది తండ్రి సహాయంబు నల్లారు ముద్దుగా పెంచుచుండెను. ఆ బాల
కుడును చూచువారలకు కన్నుల పండువుజేయుచు, శుక్లపక్ష చంద్రుని
వలె దినదిన ప్రవర్థమానుడగుచుండెను.

అతని బ్రహ్మతేజస్సును, నిరుపమాన సౌందర్యంబును గనినవా రెల్లరును, కుమ్మరి చిన్నదాని కేమ, యిట్టి మహోన్నత తేజోమూర్తి జన్మించుటేమి! యని మిగుల నాశ్చర్యచకితు లగుచుండిరి. అందును కన్యకు సంతానము కలుగుటకు ప్రజలు మరింత యబ్బురపడి, కుమ్మరివాని నొత్తిచేయ వాడు జరిగిన సంగతినంతయు జెప్పి, తన యల్లుడొక బ్రాహ్మణుండని జెప్ప వారు సంతుష్ట మతులయిరి.

'ఓ భోజరాజా! యా కుమ్మర బాలుని యనంతర చర్యలను నీకు నాపయిదున్న విగ్రహంబు చెప్పగలదు పొమ్మ్మ' అని యా విగ్రహంబు జెప్ప భోజు డటులు చేసెను.

—♦ 31వ ప్రతిమ చెప్పిన శాలివాహన వృత్తాంతము ♦—

'ఓ భోజరాజోత్తమా! అప్పటికి రెండువేల సంవత్సరంబులు గడువ, విక్రమార్కుని యాయువు పూర్తియయినది. కుమ్మరి చిన్నదాని కుద్భవించిన యా బాలుండే శాలివాహనుడు. అతడు జన్మించిన మహూర్త బలిమిచే నతడొక శకకర్త యయ్యెను. కాళికాదేవి యానతి చొప్పున విక్రమార్కుండు శాలివాహనునిచే హతుడు గావలసి యున్నది. ఆ కుమ్మరి బాలుం డెట్లు విక్రమార్కుని మరణకారణ మయినదియు నేను నీ కెరింగించెద నాలకింపుము.

పదునారేండ్ల బాలుండగు శాలివాహనుండు విక్రమార్కునకు కప్పము గట్టును నుతనికి లొంగియున్న తన ప్రభువు నొద్దకు జని 'అయ్యా! నేను తను దగనులో నొక యుద్ధభటునిగా గోరుచున్నాను. అన నా రాజు వానిని బరీక్షించి, యతని సమర్థతకు మెచ్చి, వానినొక దళాధికారిగా జేసెను. ఇట్లుండ నా రాజ్యంబున పంటలు లేక క్షామము సంభవించ నతడు విక్రమార్కునకు కప్పము కట్టలేక పోయెను. అంత విక్రమార్కుండా రాజుపయి కోపించి, వానిపైయుద్ధంబునకరిగెను. శాలి

వాహానుండు శత్రుసైన్యంబుల నెల్ల నతిసాహసంబున బరిమార్చి, తన రాజునకే విజయంబు రాబోవునట్లు జేసెను. విక్రమార్కుండు శాలివాహానుని ధాటికి నిలువలేకపోయెను. అంత విక్రమార్కు డాశ్చర్యమంది మంత్రియగు భట్టితో నిట్లనియెను. "భట్టీ! యెన్నండును లేని మనకిపు డిట్టి యోటమేమి? యిది కడు ఆశ్చర్యంబుగా నున్నది." అన భట్టి తన ప్రభువునకిట్లు విన్నవించెను.

'ప్రభూ! ఇప్పటికి మనము బ్రతుకు కాలము రెండువేల సంవత్సరంబులును పూర్తియైనవి. ఇక మనము రాజ్యపాలనంబు చేయుటగాని మన యాజ్ఞలు నెరవేరుటగాని, జరుగుట కల్ల. అని నుడువ విక్రమార్కుండు కాళికాలయంబున కేగి, యద్దేవి నారాధింప యామె ప్రత్యక్షమై విక్రమార్కున కిట్లనియె. "ఓ విక్రమార్క మహారాజా! నీవింక భట్టి సహితుండవై స్వర్గారోహణ మొనర్చు కాల మాసన్నమైనది. శాలివాహానుని చేతిలో నీవు చత్తువు. కుమ్మర బాలుని చే హతుడవుట కిష్టపడవేని భట్టియు, నీవును నాత్మహత్య గావించుకొని స్వర్గపురి జేరుడు. ఆదేవి మాటలకు భట్టి, విక్రమార్కులు సంతసించి, యాదేవి యెదుటనే కరవాలంబులతో పొడుచుకొని మరణించిరి. అనంతరంబు విక్రమార్కుని కళేబరంబుతో నాతని రాణులందరును సహగమన మొనర్చి, భట్టి విక్రమార్కులతో పుష్పవిమానంబుల నెక్కి తాముగూడ స్వర్గపురి చేరిరి. ఈ సింహాసనంబు తొలుత యీశ్వరుని యనంతరంబు దేవేంద్రునిచే విక్రమార్కున కీయబడిన యీ సింహాసనంబు విక్రమార్కుని యనంతరంబు భూమిలో పూడ్చబడినది. అది నీకెట్లు లభించినదియు నివే యెరుగుదువుకదా" అని యాబొమ్మ చెప్ప భోజుండు యిట్లు ముప్పదిరెండు ప్రతిమలుగా నున్న మీ రెవ్వరు? ఈ మనుష్య భాషణంబు మీ కెట్లబ్బెనని యడుగ, ముప్పది రెండవదియు, కడసారిదియు నగు ప్రతిమ భోజునకిట్లు చెప్పదొడంగెను.

---

—♦.32వ విగ్రహము చెప్పిన స్వీయ చరిత్ర ♦—

"ఓ భోజరాజా! మేము ముప్పది యిద్దరమును పార్వతీదేవి చెలులము. ఒకనాడు మేము పార్వతి శివునితో సరససల్లాపంబులాడుసను యంబున మే మందరమును రహస్యంబుగా జూచియుండి వింటిమి. ఆ సమాచారం బెరింగిన యీశ్వరి మాపై నలిగి, మీ రెల్లరును మావద్ద నున్న సింహాసనంబుపై ప్రతిమలు కండు" అని శపించెను. పలు తెరగుల మేమామెను ప్రార్థింప నామె తిరుగ నిట్లు శెలవిచ్చెను. "నా శాపంబు తిప్పుటకు వీలు లేదు. కాన, యీ సింహాసనంబుపై భూలోకంబున విక్రమార్కుడను వాడు న్యాయముగ రాజ్యపాలనంబు చేయగలడు. అతని యనంతరంబు భోజుండను వాడీ సింహాసనంబు నెక్క బ్రయత్నించును. ఆ భోజునకు మీరు విక్రమార్కుని గుణములన్నియు నిరూపించి చెప్పిన మీకు శాపవిముక్తి గలుగును. అట్లు చెప్పుటకు విక్రమార్కుని యనంతరంబు మీకు మనుష్య భాషణము రాగలదు.

అని యామె యొసంగిన యానతి ననుసరించి, మేము ముప్పది యిద్దరమును నీ విగ్రహ రూపంబులతో విక్రమార్క మహావల్లభునకు సేవ యొనర్చి, యాతని గుణాతిశయంబుల నీకు జెప్పితిమి. ఇక మా శాపంబును దీరె' అని యా విగ్రహము జెప్పునంతలో నటనున్న ముప్పది రెండు విగ్రహములును అప్సరసలుగా మారి, భోజునకు నమస్కరించి,

"ఓ మహారాజా! మా తప్పిదంబుల నన్నింటిని మన్నించి, మా లోకమునకు కరుగుటకు ననుమతించి, నీవీ సింహాసనము నధిష్ఠించి,మహా వైభవంబుతో ధరాపాలనంబు గావింపుము. నీవును విక్రమార్క సముండవు. గాన, నీ కెట్టి కొరంతయు నుండదు. నీకు సర్వశుభంబులును జేకూరుగాక!'

అని దీవించి, పార్వతి చెలులగు నా ముప్పదియిద్దరు దేవాంగనలును నంతరిక్ష మార్గమున నెగిరిపోయిరి.

———

# ముగింపు.

## —♦ భేతాళుని నిజవృత్తాంతము ♦—

అట్లు ముప్పదిరెండు విగ్రహములు అప్సరసలుగా మారి, కయిలాసంబున కేగిన యనంతరము, ఒక శుభముహూర్తము నందు భోజరాజు సర్వాలంకృతుండయి, సర్వ సామంత, సేవక, మంత్రి పురోహిత సకల పరివార జనంబులతోడను, పరమోత్సాహంబున, విక్రమార్కుని సింహాసనము నధిష్టింప వలయునని, యరుదెంచి, యొకొక్క సోపానము పయి కాలు నిడునంతలో, లోకమాతయు, పరమ పావనియు నగు కాళికాదేవి, భోజునకు తన నిజరూపంబుతో బ్రత్యక్షంబయి, 'ఓ భోజమహీపతీ! ఆగు మాగుము. నీ వింకను నీ సింహాసనము నెక్క సమర్థుండవు కావు" అన, భోజరాజు జగదంబకు బ్రణమిల్లి 'తల్లీ! నా యందేల నీ కింకను దయ రాకున్నది. విక్రమార్కుని సముడను నేనుగానా? నాకంటెను వాని యందుగల యాధిక్యత యేమున్నది. అతనికి నీవును భేతాళుండును వశులయి, సర్వకాల సర్వావస్థల యందును వానిని కంటికి రెప్పవలె గాచుచుండుటను బట్టి, విక్రమార్కుం డట్టి సాహసకార్యములను జేయగలిగెను. భేతాళుని యనుగ్రహంబును, నీ దయయు నాకుగూడ నుండిన యెడల నేనును, నట్టి పరాక్రమ వంతుడనే కాకలను' అని చెప్పిన భోజుని మాటలకు గాళి యిట్లులనియెను.

"ఓ భోజ మహీపతీ నీ కట్టి యహంభావ ముండుటయే నీ వింకను నీ సింహాసనము నెక్క సమర్థుండ వయితివి. విక్రమార్కుడు, నేనును, భేతాళుండును తనకు స్వాధీనము గాక ముందే యాతడు మహా పరాక్రమ కార్యముల నాచరించెను. భేతాళుడు తొలుత విక్రమార్కున కెట్లు వశంబయినదియు నీకు నేను జెప్పెద. సావధానుండవయి, యాలకింపు" అని కాళి భోజునకిట్లు చెప్పుచున్నది.

"ఓభోజమహీనాథా! దిగంతయశో విభాసితుండగు విక్రమార్కుడు సర్వసమర్థుండగు భట్టితో రాజ్యపాలనంబు జేయుచుండు కాలమున నొక సన్యాసి యాతని కడ కరుదెంచెను. సన్యాసిని విక్రమార్కుండు గౌరవించి, యాతాపసి తనకడకు వచ్చిన కార్యము నడుగ, నతడు రాజచంద్రమా! కాళికాదేవికి ప్రియంబగు హోమంబు నొకదానిని నేను జేయుచున్నాను అది మిగుల నిష్ఠతో జరుగవలసిన క్రతువు. ఆకార్యమున నాకు సహాయము నొనరించువా రెవ్వరును లేరు. కనుక నీ వరుదెంచి నా యజ్ఞము సాంతము నెరవు నచట యుండి నాకు సాయము నొసంగిన లయును. నీవు తప్ప యన్యులీ కార్యంబున నాకు సాయపడజాలరు. నా కోరిక నువ్యర్థము చేయకుందువు గాకయని ప్రార్థించుచున్నవాడను' అన విక్రమార్కుండా సన్యాసి కోర్కెను నెరవేర్చి యతనికి సహాయము నొనర్చుటకు సమ్మతించి, సన్యాసితో పురబాహ్య ప్రదేశంబున కాళి కాలయంబు చెంత సన్యాసి యేర్పరచిన యజ్ఞశాలకు చనియెను. యటుల చనినంతనే సన్యాసి విక్రమార్కునితో నిట్టులనియెను. "రాజోత్తమా! యిచటి కుత్తరపు దెసను క్రోసెడు దూరమున నొక బ్రహ్మాండమైన మోదుగు వృక్షంబొకటి యుండును. దాని కొమ్మలకు భేతాళుడు తలక్రిందులుగా వ్రేలాడుచుండును. నీ వచటకు జని వాని నెట్లయినను యజ్ఞశాలకు గొనిరావలయును. నీవుతప్ప యన్యు లెవరేగినను యత్నము రాణిం సన్యాసి జెప్పిన తెరంగున విక్రమార్కుండు భేతాళుని గొనివచ్చుటకు చనియెను. సన్యాసిజెప్పిన కార్యము సాధ్యమో యసాధ్యమో యని యాలోచింపక, సాటిలేని పరాక్రమమును సాహసమును గలవాడగుట చేవిక్రమార్కుండట్లు జని చని, యొక పాలాశ వృక్షమునకు తలక్రిందులుగా వ్రేలాడుచున్న గ్రహనాయకుడగు భేతాళుని గని, సన్యాసిజెప్పిన తెరంగున వానిని కఠినపాశంబుల బంధించి మూపునబెట్టుకొనివచ్చుచుండెను. అంతవరకు నేనియు బలుకక, సులభంబుగా విక్రమార్కునిచే

గట్టుపడిన భేతాళుండు మార్గమధ్యమున విక్రమార్కునితో దా నిట్లు బలికెను.

"ఓవిక్రమార్క మహీనాథా! ఈప్రపంచమున నేరికిని గట్టువడ నసాధ్యుఁడనైననేను, దేవాంశ సంభూతుఁడవగు నీకుమాత్రము సులభంబుగ గట్టుపడితిని. నీవు సకలసద్గుణ ఖనివే. నిరుపమానసాహసౌదార్యాది మహాగుణములగలవాఁడవే. అయినను నేనూరక మేఁకవలె నీవెంటఁజనుట మంచిదికాదు. నేనొక చిత్రమగుకథను జెప్పెదను. దాని నీవు సాంతముగా విన్న యనంతరంబు నేను కొన్ని ప్రశ్నల నడిగెదను. ఆ ప్రశ్నలకు నీవు సరియైన సమాధానంబు తెలిసియుండియు చెప్పనిఎడల నీశిరస్సు వేయిఖండములగును. నేను కథజెప్పిన యనంతరంబు నీవు పలికితివా నాకట్లను విప్పుకొని పారిపోయెదను. ఈ యేర్పాటునకు నీవు బద్ధుఁడవుగాక తప్పదు. ఇక నాకథను జెప్పుచున్నాను. సావధానుఁడవయి వినుము" అని భేతాళుండు విక్రమార్కున కొక కథను చెప్ప నారంభించెను. ఆ కథను కాళికాదేవి భోజునకిట్లు చెప్పుచున్నది

---

## — ♦ కళావతి వృత్తాంతము ♦ —

"ఓ భోజరాజా! భేతాళుఁడు విక్రమార్కున కిట్లు చెప్పుచున్నాఁడు.

'ఓ విక్రమార్క సార్వభౌమా! భీమ నగరమను పట్టణమున పేరిశాస్త్రియను బ్రాహ్మణుఁడొకఁడు గలఁడు. వాని కన్యారత్నము రూపలావణ్యనిధియగు కళావతియను కుమార్తెయొకతె గలదు. నీరుడు, తాపసి, చతురుఁడనను ముగ్గురు విప్రకుమారులా బాలామణిని ప్రేమించియామెను తమకిచ్చి వివాహంబు చేయవలసినదని పేరిశాస్త్రి నడుగ నతఁడు వారికిట్లనియె. అయ్యో! యొక్కతె ముగ్గురకు భార్యయగుట ప్రమాదహేతువు గాన మీలో నొక్కరామెను వివాహమాడి సుఖింపుఁడు. ఎవరు వివాహమాడునదియు మీ లోమీరే స్థిరపరచుకొనుఁడు" అంతట

నాయువకులు ముగ్గురును నా బాలికకై వంతులాడ మొదలిడిరి. వార ట్లు తగవులాడుచుండగా నొక భయంకర రాక్షసుండాకాశమార్గమునుం డి యరుదెంచి కళావతిని నెత్తుకొని మింటికెగసి, పారిపోయెను. తమకు మార్తెను రాక్షసుండు గొనిపోవుటను గని, యామె తలిదండ్రులుమిగు ల దుఃఖింపసాగిరి. ఆమెను వివాహ మాడవచ్చియు పలుకు గూడనట్టి సౌందర్యవతిని పోగొట్టు కొన్నందులకు మిగుల వాపోవ దొడ్గిరి. అంత నా ముగ్గురిలోను నొకడగు తాపసి మిత్రులారా! నా దివ్యజ్ఞాన ప్రభావమున నారక్కసుడు కళావతి నెచటికి గొనిపోయి, యుంచిన దియు జెప్పెదను. కాని, యచటికేగ నా వలనుగాదు" అం చతురుడి ట్లనియె. "స్నేహితులారా! తాపసి చెప్పిన తావునకు బోవనను కూలమైన యొక గొప్పరథంబును నాబుద్ధి చాతుర్యంబుచే జేసియిచ్చెద కాని యాతావునకు బోవ నావలను గానిపని' యని నుడివెను. అంత వీరుడు అన్నలారా! తాపసి జెప్పిన తావునకు చతురుడొసర్చిన యరదంబు నె క్కి పోయి, నా భుజవీర్యంబు జూపి, యారక్కసుని సనుమాడి కళా వతిని దెచ్చువాడ' అనియెను.

అంత తాపసి తన దివ్యదృష్టిగొజూచి, యా భయంకర రాక్ సుండు కళావతి నెటదాచినదియు జెప్పెను. చతురుండు తనచాతుర్యంబు ను జాటునొక యద్భుత రథమును నిర్మించెను. అంత వీరుండా రథము నెక్కి తాపసి జెప్పిన తావునకు జని, యారాక్షసునితో ఘోర యుద్ధం బు జేసి, కళావతిని తన రథంబుపై నెక్కించుకొని వచ్చి యా లేమను తలిదండ్రులకడ జేర్చి వారికి పుత్రికాశోకము బాపెను

ఓవిక్రమార్కా! కథనంతయు వింటివిగదా. ఆముగ్గుర యువకుల లోను కళావతిని వివాహం బాడ నెవరు తగుదురో నీ బుద్ధికుశలతను వినియోగించి జెప్పుము' అని భేతాళుండు బలుక, విక్రమార్కుండు అయ్యా! తాపసియు, చతురుండును తమ విద్యా ప్రభావముల మా

త్రిమే జూపగలిగిరి. కాని, వీరుండు రాక్షసునితో ప్రాణములపై నాశ విడి, ఘోరయుద్ధ మొనర్చి, కళావతిని తెచ్చినాడు. కాన నా వీరుండె కళావతిని వివాహంబాడ నర్హుండు' అని విక్రమార్కుండు జెప్పినంతలో భేతాళుండు తనకట్లను విప్పుకొని, విక్రమార్కుని భుజంబులనధిరోహించి పారిపోయి, తిరుగ తన యథాస్థానంబగు మోదుగువృక్షంబు జేరెను. అంత విక్రమార్కుండు తిరుగ భేతాళుని కడకు పయనంబై చనియెను.

---

## వరుస తెలియని వైశ్యకుమారులకథ

అట్లు విక్రమార్కుండు బేతాళుడు తన్నడిగిన ప్రశ్నలకుసమాధానంబు జెప్పినంతె, తాము గోలుతగావించుకొనిన ఏర్పాటునకు విరుద్ధముగా, విక్రమార్కుడు మాట్లాడినందున బేతాళుడుకట్లువిప్పుకొనిమోదుగువృక్షంబు కడకు పోయి, దానికి దలక్రిందులుగా యెథాస్థితినివ్రేలాడుచుండె. విక్రమార్కుడును బేతాళుని గొనక సన్యాసికడ కరుగనిచ్ఛ లేనివాడై తిరుగ యాగ్రహపడి భుని బంధించి భుజాబులపయి నిడుకొని వచ్చుచుండెనని జెప్పి, వెండియు నా కాళి భోజున కిట్లు చెప్పసాగెను.

ఓభోజభూపాలకా! అట్లు తన్ను గొనిపోవు విక్రమార్కునకు బేతాళుడు తడవకొక కథచొప్పున నిరువదినాలుగు కథలు జెప్పి ఇరువది నాల్గు ప్రశ్నలను నడిగెను. నీకు కాలాతిక్రమణాంబగుచుగాన నేనందు కొన్నికథలనె జెప్పితిని. విక్రమార్కుడిరువదినాల్గుప్రశ్నలకును సమాధానంబు జెప్పుటచేత బేతాళు డిరువదినాల్గు తడవలు పారిపోయి మోదుగు చెట్టుజేరి ఇరువదయిదవ సారియు, కడసారియు జరిగిన విషయంబును నేనిపుడు జెప్పుచున్నాను. సావధానుండవయి యాలకింపుము' అని అట్లిరువదయిదవ సారి విక్రమార్కుండు బేతాళుని గొనిపోవుచుండ నంత డి క్రిందికథను కడసారి చెప్పసాగెను.

ఓయీ విక్రమార్కా! గరుడపురమున కుబేరుడను నొకవర్త

కుంతు గలడు. ఆ వైశ్యునకు వసుమతియను భార్యయు, వాసదత్త యను నొక నిరుపమాన లావణ్యవతియగు కుమార్తెయు కలరు. కొండొక కాలమునకా శెట్టి వ్యాపారార్థము ద్వీపాంతరంబుల కరిగి యెంతకాలమునకును తిరిగి రాడయ్యె. అట్లు కొన్ని సంవత్సరంబులవరకును వాని కొరకై యతని భార్యాసుతలు కన్నులు కాయలుగాచునట్లు జూచి, యొక ముహూర్తమున వానియునికి తెలిసికొనవలయునని పయనమయిరి. అట్లు వారిరువురు మాతాసుతలు చనిచని, యొక యరణ్య మార్గంబుగుండా బోవుచుండ నా మార్గంబున జను తండ్రి కుమారులను నిరువురు వైశ్యులు వారిని గనిరి. అంత తండ్రి కుమారునితో నిట్లనెను

వత్సా! అదే మనముం దిరువురు స్త్రీలు చనుచున్నారు జూడుము వారిరువురి పదఘట్టంబులను బట్టి చిన్నయడుగులది చిన్నదిగాను, పెద్దయడుగులది పెద్దదిగా నుందురు. నీవు చిన్నవాడ వగుటచే చిన్నదానిని నేను పెద్దవాడ నగుటచే పెద్దదానిని స్వీకరించి వివాహ మాడుదము" ఆ మాటలకు కుమారుండు సమ్మతించెను. మరికొంత దూరంబు చనినంత వారు నలుగురును నొక కోనేటిచెంత గలసుకొనిరి. అంత తండ్రి కుమారులా వైశ్యస్త్రీలకు తమ కోర్కెను చెప్ప వారు కుబేరుడంత కడకుముందే యెటనో మృతుడై యుండుననియు, వానికొరకు వృథా. యింక తిరుగుట నిష్ప్రయోజనంబనియు, యిపుడు తాత్కాలికముగా తమకు లభించిన పురుషులతో తృప్తినందుటయు క్షేమంబనియు నెంచి వసుమతియు వాసనదత్తయు నా పురుషులకు భార్యలగుటకు సమ్మతించిరి. కాని చిన్నపాదంబుల గలది తల్లిగాను పెద్దపాదంబులు గలదికుమార్తెగాను యుండుట తటస్థించెను. అయినను తాము తొలుతగావించుకొనిన యేర్పాటునకు భిన్నంబుగా నడచుకొన నా తండ్రికుమారు లిష్టంబులేనివారై తల్లిని కుమారుండును, కుమార్తె నాతని తండ్రియు స్వీకరించి వారితో తమ గ్రామంబుపోయి సుఖించుచుండిరి.

యు సంతసించి, సన్యాసికడ కరిగి, యాతని కేమియు ననుమానము త
ట్టకుండునట్లు 'అయ్యా! మీ యాజ్ఞ ననుసరించి, భేతాళుని బంధించి తె
చ్చినవాడను, ఇక యిపుడు చేయవలసిన కార్యమేమి?' యని యడుగ,
నా సన్యాసి తన కోరిక నెరవేరనుండుట కెంతయు లోలోన సంతసిం
చుచు, 'ఓ విక్రమార్కా! ఇపుడు నీవీ యగ్నిగుండమునకు సాగిలబ
డి మ్రొక్కవలెను" అని చెప్పి, అట్లు విక్రమార్కుండు చేయుచుండ
సమయమున నాతని శిరమును నరికి, యగ్నిగుండములో వేయుటకై
వేచియుండెను. ఈ సమాచారము నెరింగియున్న, విక్రమార్కుండా
సన్యాసితో నిట్లనియెను.

'అయ్యా! నే నింతకాలమును చక్రవర్తినయి రాజ్యపాలనము
గావించితిని గాన, యిప్పటి వరకు నేరికిని సాగిలబడి మ్రొక్క యెరుం
గను. దాన, యీ కార్యము నెట్లు నాచేతం జేయుటయో యెరుంగకుం
టిని. తమ రొక్కసారి, యెట్లు సాగిలపడవలయునో క్రియా రూపముగ
జూపిన యెడల, యనంతరము నేనును నట్లు చేయగలవాడను" అని చె
ప్ప, సన్యాసి గర్వముగా, 'యిట్లు చేయవలయును రాజా" అని తా
ను యగ్నిగుండమునకు సాగిలబడి మ్రొక్కుచుండ సమయంబున విక్రమా
ర్కుండు తన మొలలోని రహస్యముగా నాయుంచుకొనిన కరవాలమును దీసి
యా కపటసన్యాసి శిరమును నరికి, యగ్నిగుండములో బారవైచె
ను. నాడనే నేను (భేతాళ) విక్రమార్కునకు బద్ధుఁడనయి, యాతని
సాహసమునకు మెచ్చి, వలయు కోర్కెల నన్నిటిని నెరవేర్చి, నాటి
నుండియు, నేను, భేతాళుండును వానిని యెడ నుండి సర్వవిధముల గా
పాడినారము.

"ఓ భోజరాజా! నిపుడు విక్రమార్క సమానుండవు. గాన నా
సాక్షాత్కారము గూడ నీకు లభించినది. ఇక నిరవిచ్ఛిన్నముగా యీ
విక్రమార్కుని సింహాసనము నధిష్టించి, మహావైభవంబుతో వేయి

సంవత్సరములు రాజ్యపాలనము గావింపుము. నీకు సర్వ శుభంబులు చేకూరుగాక!' అని దీవించి కాళికాదేవి యంతర్ధానమయ్యెను.

అంత, కాళిని మనంబున బలుతెఱంగుల స్తుతించుచు, నొక్క శుభముహూర్తంబున భోజమహీపతి సర్వాలంకార పరిశోభితుండయి, వంధిమాగధులు తన్ను గొలువ, సర్వమంత్రి సామంతాది ప్రముఖులును జయధ్వానము లొనర్ప, పురంధ్రీమణులు మంగళగీతముల పాడ, బ్రాహ్మణోత్తము లాశీర్వచన వాక్యముల బలుక, దేవత లాకసమునుండి పుష్పవర్షము గురియింప, మహా వైభవంబుతో విక్రమార్కుని సింహాసనము నధిష్టించి, ధరాపాలనంబు గావింప దొడంగెను.




శ్రీ కృష్ణాప్రెస్, రాజమండ్రి—1935

